


సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె వి. గోవిందరావు,
బి ఏ.,ఎల్ ఎల్.బి.
గౌరవ సహాయ సంపాదకులు :
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు,
ఎమ్.ఏ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఏ.,బి ఎల్
సభ్యులు :
కె.వి ఎస్. గోవిందరావు,
బి.ఏ.,ఎల్ ఎల్.బి
కె.వి.ఎస్. శరత్‌బాబు,
బి.ఏ.,బి కామ్.,బి ఎల్
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |

చందాలు పంపవలసిన చిరునామా :

విస్డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004

# ఈ సంచికలో

అక్టోబరు 1984

| | |
|---|---|
| ధ్యానం, సంపాదకుని పేజీ | 2 |
| యాత్రా స్థలాలు - మాంగాడు | 5 |
| తృప్తే ఆనందమా? | 7 |
| బిపిన్ చంద్ర పాల్ | 9 |
| జీవితం నేర్పిన పాఠాలు | 13 |
| ప్రపంచ నగరాలు - ఢిల్లీ పట్టణం | 17 |
| చిట్టి దేవతలకు చిన్న కథలు | 21 |
| భారతీయ ఋషులు | 25 |
| మెరికల్లాంటి పిల్లల్ని గుర్తించడం ఎలా? | 29 |
| కార్టూనులు గీయటం ఎలా? | 31 |
| బహుమతి పొందిన వ్యాసం | 33 |
| అమెరికాలోని 'పజిల్' ప్రాసాదం | 36 |
| ఈశ్వర్ కోట్టమ్ | 37 |
| నమ్మలేని నిజాలు | 38 |
| కలం స్నేహితులు | 39 |
| 'ప్లానెటేరియమ్' అంటే....? | 41 |
| బంగారు పునాది గల 'పురందర్' గేటు | 47 |
| ప్రపంచ వార్తలు | 48 |
| 'అసూయ' చేసే చెరుపు | 49 |
| మీకు తెలుసా? | 51 |
| నవ్వు | 55 |
| ఈస్ట్‌మన్ కనిపెట్టిన బాక్స్ కెమేరా | 57 |
| పోటీలు | 59 |
| పోటీలు (ఫలితాలు) | 63 |



ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ :
శ్రీ వి. సత్యమూర్తి, మద్రాసు.

**తెలుగు 'విస్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

## ధ్యానం

### జగత్తు మేలే వ్యక్తి మేలు అవుతుంది!



జేమ్స్ ఎలెన్

ఆధ్యాత్మిక జగత్తును పాలించేది నిత్య సూత్రాలు; తాత్కాలికమైన ఉద్వేగాలు కాదు క్షణిక ప్రేరణలు కాక. నిత్యసత్యాలే ఆ జగత్తుకు పునాదులు! దుఃఖం, ఆందోళనా, పశ్చాత్తాపం లాంటి వాటికి అక్కడ తావు లేదు. వ్యక్తి మేలు ముఖ్యం అనుకునేటంత వరకే బెంగలూ అదుర్దాలూ; 'అహం' సుఖం కోసం, రక్షణ కోసం, దానిని శాశ్వతం చేసుకోడం కోసం తహతహ!

ఆధ్యాత్మిక జగత్తులో ఇవేవీ ఉండవు. జగత్తు మేలే వ్యక్తి మేలు అని విశదం అవుతుంది. అలజడులూ, ఆందోళనలూ పీడకలల లాగ పటాపంచలయిపోతాయి!

## సంపాదకుని పేజీ

### చిల్లర శ్రీ మహాలక్ష్మి



నెపోలియన్

తరచు అల్పమైనవి కూడా అత్యద్భుతమైనవి కావచ్చు ఒక చిన్న ఇసుక రేణువు అల్పమైందే! కాని అలాంటి చిన్న చిన్న ఇసుక రేణువులే అనేకం చేరి బ్రహ్మాండమైన ఎడారి ఏర్పడుతుంది! నీటి బొట్టు చిన్నదే! కాని అలాంటి నీటి బొట్లే కలిసి ఒక మహా సముద్రం అవుతుంది. మఱ్ఱిచెట్టు విత్తనం ఆవగింజంతే ఉంటుంది. అయినా దానిలో నుంచే బ్రహ్మాండమైన ఆ చెట్టు ఆవిర్భవిస్తుంది.

చాలా వస్తువులు పైకి అల్పంగా కన్పించవచ్చు. కాని. అవే జీవితంలో మన జయాపజయాలను నిర్ణయిస్తాయి. జీవితాన్ని సుఖ

"కలిసి వచ్చినప్పుడు సుఖాలలో దేవుణ్ణి స్మరిస్తే, ఇక కష్టాలే రావు!" —కబీర్

మయంగా గాని, దుఃఖభరితంగా గాని తీరు స్తాయి. అభ్యుదయాన్ని కలిగించడమో, అధః పాతాళానికి అణచివేయడమో చేస్తాయి.

కొన్నాళ్ళ క్రిందట లండన్ పరిసరాల లోని ఒక ఎలెక్ట్రిక్ పవర్ స్టేషన్‌లో పిచ్చు కలు ఒక గూడు కట్టాయి ఆ గూట్లో నుంచి కొన్ని గడ్డి పరకలు ఎగిరి వెళ్ళి స్విచ్ అను బంధాలకు విఘాతం కలిగించాయి. ఫలితంగా, ఆ పవర్ స్టేషనూ, దానితో సంబంధం ఉన్న మరి కొన్ని పవర్ స్టేషన్‌లూ కూడా పని చేయడం మానేశాయి. మూడు లక్షల మందికి కరెంటు లేకుండా పోయింది. సినిమాలు ఆగి పోయాయి. ఆసుపత్రులు స్వంత జనరేటర్ లతో పని చేయవలసి వచ్చింది. వీధులలో ట్రాలీ బస్సులు ఎక్కడివక్కడే నిలిచి పోయాయి మళ్ళీ ఒక గంట సేపటికి గాని నగరానికి కరెంటు సరఫరా కాలేదు.

ఒక అమెరికన్ నగరంలో ఉన్నట్టుండి పార్కింగ్ మీటర్‌లు పని చేయడం మానే శాయి కార్ల యజమానులు కొందరు ఆ



## బొమ్మలలో హాస్యం

### తాడూ, బొంగరం!




మీటర్‌లు పని చేయడం లేదనీ, తమ తప్పు లేకుండానే తమ వద్ద ఫైన్‌లు వసూలు చేస్తా రనీ పోలీసులకు ఫిర్యాదు చేశారు. ఆ మీటర్‌లు ఎందుకు పని చేయడం లేదో చూడడానికి ఒక టెక్నీషియన్‌ని పంపారు. ఆ యంత్రా లలో నాణేలు పడవేసే రంధ్రాలలో సాలీళ్ళు చేరాయి. వందల కొద్దీ సాలీళ్ళకు గూళ్ళు కట్టుకునేందుకు అవి మిక్కిలి అనువుగా కని పించాయి. దట్టమైన సాలెగూళ్ళ వల్ల నాణేలు యంత్రాల లోపలికి పోవడం లేదు.

పొట్టిగా పీలగా కనిపించే మనుష్యులు ఎందుకూ కొరగాని వారు అనుకోకండి! నెపోలియన్ ఎత్తు: కేవలం 5 అ.ల, ఒక అంగుళం; జూలియస్ సీజర్ ఎత్తు: 5 అ.ల, 2 అంగుళాలు. అలెగ్జాండరు ఎత్తు: 5 అ.ల,

" 'నిరాశ' ఆవహించినప్పుడు – బరువంతా 'అతగాడి' మీద మోపి, నువు నిశ్చింతగా ఉండు!" —స్వామి రామదాస్

3 అంగుళాలు. వారు ప్రపంచ మహా యోధులు కావడానికి వారి పొట్టి తనం ఏ మాత్రం ప్రతిబంధకం కాలేదు.



సీజర్



అలెగ్జాండరు

1815 లో హంఫ్రీ దవే 'ప్రమాదం లేని దీపం' (safety lamp) కనిపెట్టాడు. 'తీగె వల గుండా మంట ప్రసరించదు' అనే సరళమైన సూత్రం ఆధారంగా ఆయన ఆ దీపం తయారు చేశాడు. అంత సామాన్యమైనదే అయినా, లక్షలాది ప్రాణాలను ఆ దీపం కాపాడింది.

ప్రపంచంలో ఈ నాడు అమూల్యమైనదిగా భావించబడే ఒక శిల్పాన్ని మైకేల్ ఏంజెలో దేనితో నిర్మించాడో తెలుసా? 'బాస్సెలినో' అనే మరో శిల్పి పనికి రాదని బయట పారేసిన ఒక చలువరాతి దిమ్మను అతడు ఆ శిల్పంగా మలిచాడు!

పిల్లలు కూడా ఒక్కొక్కప్పుడు చాలా ప్రధాన పాత్ర నిర్వహించగలరు. ఇటలీలో ఒక కుగ్రామమైన 'కొల్లోడీ'లో 1880 లో 'కేరియోలో రెంజినీ' వ్రాసిన ఒక కట్టు కథలో ప్రధాన పాత్ర 'పినోచియో'కి ఆ గ్రామంలో ఒక స్మారక చిహ్నం నిర్మించారు. 'నీలి జుట్టు దేవకన్య' (Fairy with blue hair) అనే ఆ కథను చదవడమో, లేదా 'పినోచియో'ను గురించి వాల్ట్ డిస్నీ తయారు చేసిన కార్టూన్ చిత్రం చూడడమో చేసిన ప్రపంచంలోని బాల బాలిక లందరూ పంపించిన చిన్న చిన్న విరాళాలతోనే ఆ స్మారక చిహ్నం నిర్మించ బడింది. నిజం! చిల్లర విషయంలో జాగ్రత్త పడండి - రూపాయలు వాటంతట అవే పోగు పడుతాయి!

మీ జీవితంలో, మీరు పని చేసే పరిసరాలలో చాలా అప్రధానమైన వని భావించే ఎన్నెన్నో చిల్లర వస్తువులు కనిపిస్తాయి.

(మిగతా 64 వ పేజీలో)

"రాయబారాల్లో నాటిన బీజాల నుంచి వెంటనే ఫలసాయం ఆశించరాదు; పక్వం అయేదాకా ఆగాలి!" —ఫ్రాన్సిస్ బేకన్

# యాత్రాస్థలాలు

## మాంగాడు

మద్రాసు నగరానికి నైరృతి దిశగా 20 కి.మీ.ల దూరంలో ఉన్న 'మాంగాడు' అనే శ్రీ కామాక్షీ అమ్మవారి క్షేత్రం అతి ప్రాచీనమైంది; చరిత్ర ప్రసిద్ధమైంది. మద్రాసు



లోని వివిధ ప్రాంతాల నుంచి నడుస్తున్న డజన్ల కొద్దీ బస్సుల ద్వారా, కార్లు మొదలైన ఇతర వాహనాలద్వారా ప్రతినిత్యం వేలాది మంది దేవీభక్తులు - మాంగాడు సందర్శించి అమ్మవారి కరుణా కటాక్షం పొంది వచ్చే వారు - కనిపిస్తూ ఉంటారు. దక్షిణాదిని గల సుప్రసిద్ధ పుణ్యక్షేత్రాలను సందర్శించాలని బయలుదేరే యాత్రిక బృందాలు అవశ్యం దర్శించదగిన క్షేత్రం మాంగాడు. యాత్రికులకు అవసరమైన అన్ని ఆధునిక వసతులూ ఇక్కడ సమకూర్చారు.

'మాంగాడు' అంటే మామిడితోట అని అర్థం. పంచాగ్నుల మధ్య నిలబడి శ్రీ కామాక్షీ అమ్మవారు తపస్సు చేసిన పవిత్ర

### మీరై

(అగస్టు 1984)



ప్రపంచం అంతటిలోకీ
మిక్కిలి ధనవంతులైతే?

"మరో అశోకుణ్ణి అవుతాను!"
—ఎస్. వి. ప్రసాద్, పాల్వంచ

  

"ప్రస్తుతం ప్రపంచంలో కల్లా ధనవంతుడైన తిరుపతి వెంకన్నా తర్వాతివాడే అవుతాడు!"
—డి. సుబ్బన్న, హాలుకూరు
(అనంతపురం జిల్లా)

  

"ఇన్‌కమ్‌టాక్స్ మాత్రం ఎగ్గొట్టను!"
—కే. రామాంజనేయులు, గుంటూరు.

"చీకటిని తిడుతూ కూచోడం కన్న
ఎంత చిన్నదైనా ఒక దీపం వెలిగించడం మిన్న!" -ఒక సామెత

స్థలం ఈ మామిడి తోట. అగ్నిహోత్రం మీద తన ఎడమపాదం అంగుష్ఠం ఆన్చి నిలిచి నాలుగు దిక్కులా నాలుగు అగ్నులు ప్రజ్వరిల్లుతూ ఉండగా కుడికాలు మడచి ఎడమ కాలుపై ఆనించిన భంగిమలో ఇక్కడ అమ్మవారు కనిపిస్తారు. ఎడమచేయి హృదయ స్థానం మీద ఆన్చి, తలమీదికి ఎత్తిన కుడి చేతిలో అక్షమాల దాల్చి ఉంటుంది. ఆ విధంగా ఇక్కడ అఘోరమైన తపస్సు ఆచరించి, తత్ఫలితంగానే మద్రాసుకు నైరృతి దిశగా 70 కి.మీ. ల దూరాన ఉన్న కాంచీపురంలోని ఏకామ్రేశ్వర స్వామిని (శివుడు) అమ్మవారు వివాహం ఆడినట్టు స్థలపురాణం చెబుతూంది. అందువల్లే - వివాహం కావలసి ఉన్న కన్యలు ఇక్కడికి వచ్చి ఈ అమ్మవారికి మొక్కుకుంటే అచిరకాలంలోనే వారికి పెళ్ళి కలసి వస్తుం దని భక్తులు ఈ నాటికీ విశ్వసిస్తారు.

అద్వైత మత స్థాపకులు ఆది శంకరాచార్యుల వారు ఈ క్షేత్రం సందర్శించి ఇక్కడ 'అర్ధమేరు' (శ్రీచక్ర) ప్రతిష్ఠ చేసినట్టు ప్రసిద్ధి! ఈ శ్రీచక్రం ఉన్న క్షేత్రాలు ఇండియాలో చాలా అరుదు.

శ్రీ కామాక్షీ అమ్మవారి ఆలయమే కాక, మాంగాడులో శ్రీ వల్లీశ్వరర్ స్వామికి ఒక శివాలయం, శ్రీ వైకుంఠ పెరుమాళ్‌కు ఒక విష్ణ్వాలయం కూడా ఉన్నాయి. ఇటీవల విశేషంగా అభివృద్ధి చేయబడిన మాంగాడు క్షేత్రం ప్రస్తుతం దక్షిణాదిని లక్షలాది భక్తులను ఆకర్షిస్తున్న ప్రధాన దివ్య స్థలాలలో ఒకటి! ●

# సూర్యుడి కంటె 10 కోట్ల రెట్లు కాంతివంతమైన నక్షత్రం



మన సూర్యుడి కంటె 3,000 రెట్లు ఎక్కువ ద్రవ్యరాశి గల ఒక రాకాసి నక్షత్రం దక్షిణార్ధ గోళంలోని ఆకాశంలో 'తరాంటులా నెబ్యులా' అనబడే పాలపుంత కేంద్ర భాగంలో ముగ్గురు అమెరికన్ ఖగోళ శాస్త్రవేత్తలచే గుర్తింపబడింది. 'R 136a' అనబడే ఈ అత్యుజ్జ్వల తార ఇది వరకు మనకు తెలిసిన నక్షత్రాల కంటె 50 రెట్లు ఎక్కువ ప్రకాశవంత మైంది. పరిశీలనలవల్ల ఆ రాకాసి తార ఉపరితల ఉష్ణోగ్రత 60,000 డిగ్రీల సెంటీగ్రేడ్ అనీ, మన సూర్యుడి కంటె అది 10 కోట్ల రెట్లు కాంతివంత మైనదని నిర్ధారణ అయింది.

'రుజువు అక్కరలేని రెండు నిజాలు: 1. సృష్టిలో మనుష్యు లందరూ సమానులు, 2. పుట్టుకతోనే జీవించే హక్కు, స్వేచ్ఛ, సుఖాన్వేషణ హక్కు వారికి ఉన్నాయి."

—థామస్ జెఫర్‌సన్

# తృప్తే ఆనందమా?

గౌ. ఆవుల సాంబశివరావు



[1917 మార్చి 18 న ఆంధ్రప్రదేశ్‌లోని మూల్పూరు గ్రామంలో జన్మించిన శ్రీ ఆవుల సాంబశివరావు లాయరుగానూ, హైకోర్టు జడ్జిగానూ విశేష ఖ్యాతి గడించినవారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్ట్ ప్రధాన న్యాయమూర్తి పదవిని ఆయన అలంకరించారు. ఇటీవలనే ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్-ఛాన్సలర్ పదవి నుంచి విరమించి, ప్రస్తుతం 'ఆంధ్రప్రదేశ్' రాష్ట్రంలో 'లోకాయుక్త'గా వ్యవహరిస్తున్నారు ]

ఆనందం, సంతృప్తి పర్యాయ పదాలు కావు. 'సంతృప్తి' అంటే మనందరికీ బోధపడే అర్థం: ఉన్నదానితో సంతుష్టిపడి ఊరుకోడం అని. ఆ విధమైన మనః ప్రవృత్తి మనశ్శాంతికి దారి తీసే మాట నిజం. చాలా మందికి అలాంటి మనశ్శాంతి చాలా అవసరం అనే మాటా నిజమే!

అయితే—ఈ ప్రశ్నను మరో వైపు నుంచి కూడా మనం పరిశీలించడం అవసరం: సంతృప్తి, మనశ్శాంతి లోకంలో ప్రగతికీ, అభ్యుదయానికీ దారితీయగలవా? మార్పు ప్రకృతి సహజం. ఈ ప్రపంచం నిరంతరాయంగా మార్పు చెందుతూనే ఉంది. మానవ జాతి పరిస్థితి మెరుగుపడే విధంగా ఈ మార్పును మనం మలచుకోడం అవసరం. అందుకు కోరిక, నిరీక్షణ, ప్లానింగ్, నిరంతర పరిశ్రమ వ్యక్తికి అవసరం అవుతాయి. అవి లోక సామాన్యమైన అర్థంలో మనిషిలోని సంతృప్తికీ, మనశ్శాంతికీ ప్రతి

## ఇండియాలో జనాభా పెరుగుదల రేటు

ప్రస్తుతం ఇండియాలో ఏటా జనాభా పెరుగుతున్న రేటు 2.2 శాతం. ఇది చాలా ఎక్కువ అని ప్రముఖ భారత వాతావరణ పారిశుద్ధ్యం నిపుణుడు డా. రెష్మీ మయూర్ అంటున్నారు. ఈ దశాబ్ది ఆఖరుకు ఈ రేటును 1.5 కీ, వచ్చే దశాబ్ది చివరికి 1 శాతానికీ తగ్గించుకోలేకపోతే 2,000 నాటికి ప్రస్తుతం ఉన్న 16 కోట్ల నగర జనాభా 33.5 కోట్లకు పెరిగిపోతుంది.

"కమలాక్షు నర్చించు కరములు కరములు, శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ" —పోతన

బంధకాలు కావచ్చును. అయినా - అందరికీ ఆనందాన్ని సమకూర్చే కార్యం కోసం ఆరాటపడడం, శక్తివంచన లేకుండా అందుకు కృషి చెయ్యడం - ఆత్మవికాసం గల ప్రతి మానవుడూ అవశ్యం ఆచరించ దగిన ధర్మం! ఆర్థికంగా వెనుకబడి, దారిద్ర్యం తాండవిస్తున్న దేశాలలో ఇది మరింత అవసరం. అందరూ - అటు ప్రభుత్వమూ, ఇటు పౌరులూ కూడా - ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచడానికి తమ సాయశక్తులా కృషి చెయ్యాలి. లేకపోతే - దారిద్ర్యం, దైన్యం సంఘాన్ని పీడించడం తప్పదు. తన చుట్టూ దైన్యం తాండవిస్తూ ఉంటే ఏ వ్యక్తి అయినా నిజంగా సంతృప్తినీ, మన శ్శాంతినీ ఎలా అనుభవించ గలడు? ఈ ప్రశ్నకు ఒక్కటే జవాబు - 'ఎంత మాత్రం అనుభవించలేడు' అని! పైపెచ్చు - అలాంటి పరిస్థితులలో 'సంతృప్తి' స్తబ్ధతకూ, దారిద్ర్యాన్ని పోషించడానికీ మాత్రమే తోడ్పడుతుంది.

తోటి మానవుల జీవన స్థితిగతులను మెరుగు పరచడానికి దీక్ష వహించి చేసే తీవ్రమైన కృషి తరచు ఆశాభంగాలనూ, ఆందోళనలనూ కలిగించినా, అది వ్యక్తి జీవితానికి ఒక ప్రయోజనాన్నీ, చరితార్థతనీ కల్పించ గలదు. ఒకప్పుడు పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఇలా అన్నారు: "సాహసించి పనిచేసే వారినే తరచు విజయలక్ష్మి వరిస్తుంది. పిరికి వారు విజయం సాధించడం అరుదు!" అందువల్ల - కర్మ చేయడం అవసరం! సరియైన తీరులో - అంటే, దారిద్ర్య నిర్మూలనం కోసం, తోటి స్త్రీ పురుషుల దుఃఖాశ్రువులను, చివరికి పశుపక్ష్యాదుల దుఃఖాశ్రువులను కూడా తుడవడం కోసం - మనిషి కర్మ ఆచరించాలి. అలా మానవ జాతికి సేవ చేసే వారికి కలిగే ఆనందం, అద్భుతమైన ఆత్మతృప్తీ వర్ణింప నలవి కానివి. పూర్తిగా అంకితం అయి పని చేస్తే తప్ప ఏ కార్యాన్నీ సాధించలేము గనుక, ఆ మార్గంలో కొంత బాధ, హృదయ వేదనా ఎదురు కావచ్చు అయినప్పటికీ - తోటివారి జీవితాలలో వెలుగు రేఖలు ప్రసరింపజేస్తూ దీక్షా బద్ధులై మానవ సేవ చేసేవారిని గమనించండి. వారు పొందే ఆనందమే నిజమైన ఆనందం; శాశ్వతమైన ఆనందం! ఆ మార్గంలో ఫలితం సాధించలేక పోయినా, అసలు కృషి చెయ్యడమే అద్భుతమైన ఆత్మతృప్తినీ, ఆనందాన్నీ సమకూర్చ గలదు. ●

## కోర్టు కేసుల పరిష్కారంలో 'వేగం, జాగరూకత'

"ఇండియాలో 'న్యాయం' రైలుబండి లాంటిది సాధారణంగా ఎప్పుడూ అది లేటుగానే వస్తుంది. వేగం పెంచమంటే 'వేగం అనర్థానికి హేతువు' అనే కారణం చెప్పి దాన్ని ప్రతిఘటిస్తున్నారు. అయితే — 'వేగాన్నీ', 'జాగరూకతనీ' సమర్థంగా జోడించడం దుర్ఘటం మాత్రం కాదు!"

— వై.వి. చంద్రచూడ్
(భారత ప్రధాన న్యాయమూర్తి)

"కాళ్ళకు చెప్పులు లేవే అనే బాధ అసలు
కాళ్ళే లేని వ్యక్తిని చూసే వరకే ఉంటుంది." — డేవిడ్ హ్యూమ్

# నవభారత నిర్మాతలు

## బిపిన్ చంద్రపా

డా॥ డి. ఆంజనేయులు

చాలామంది ఆ నాటి ఇతర భారతీయ నాయకుల్లాగ కలవారి ఇంట పుట్టి



బిపిన్ చంద్రపాల్

ఇంగ్లండ్ వెళ్ళి, ఉన్నత విద్య అభ్యసించే అదృష్టానికి నోచుకోలేదు బిపిన్ చంద్రపాల్. సామాన్యమైన ఒక మధ్య తరగతి కుటుంబంలో 1858 నవంబరు 7 న పాల్ జన్మించారు. ఆయన తండ్రి సిల్హెట్‌లో సనాతన హిందూ సంప్రదాయానికి చెందిన ఒక పాత కాలపు వకీలు.

చిన్నతనం నుంచీ పాల్ పరమ స్వతంత్రుడు, విప్లవ భావాలు కలవాడు. తండ్రితో చెప్పకుండా బ్రాహ్మ మతంలో చేరి, ఆయన

---

### ముఖచిత్ర వ్యాఖ్య

(ఆగస్టు 1984)



"ఎవరి కోసం ఎదురుచూపు? ఏమిటి నీ ఆలోచన?"

—కె. శరత్‌బాబు, నందిపేట, (నిజామాబాద్ జిల్లా)

* * *

"ఇది నాట్య భంగిమా? లేక ఫొటో కోసం హంగామా?"

—పి. హెచ్. వి. ఆర్. ఆర్. బి. సురేఖా వాణి, గుంటూరు.

* * *

"ఏమి టంత ఆశ్చర్యం? నీ గురించి ఏమి వ్రాస్తానా అనా?"

—గోపమ్ లక్ష్మీనారాయణ, కోరట్ల, (కరీం నగర్ జిల్లా)

"అన్ని కళలలోకీ గొప్ప కళ అందమైన నడవడి." —ఎమర్సన్

ఆగ్రహానికి గురి అయాడు. లెక్కలలో ఎప్పుడూ వెనుకబడి ఉండడం వల్లా, చిన్నతనం నుంచే రాజకీయాలలో ఆసక్తి కనబరచడం వల్లా ఐ ఏ. (ఇంటర్మీడియట్) పరీక్ష తప్పాడు. అయితే 20 ఏళ్ళు వచ్చేసరికి ఇంగ్లీష్, బెంగాలీ భాషలలో అఖండమైన పాండిత్యం సంపాదించాడు. 'బంగదర్శన్', 'బంగ బాసి' వంటి బెంగాలీ పత్రికలకూ, 'ది బ్రాహ్మో పబ్లిక్ ఒపీనియన్', 'ది బెంగాలీ పబ్లిక్ ఒపీనియన్' లాంటి ఇంగ్లీషు పత్రికలకూ తరచు వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాడు

రాజా రాం.మోహన రాయ్ ఆరంభించగా కేశబ్ చంద్రసేన్ నాయకత్వంలో పరిపుష్టి ఏర్పడిన 'బ్రాహ్మో సమాజ' ఉద్యమం ప్రభావం పాల్ మీద గాఢంగా ప్రసరించింది. వ్యక్తి స్వాతంత్ర్యానికీ, సంఘంలో సమానత్వానికీ బ్రాహ్మో సమాజం ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. అప్పు డప్పుడే రాజకీయ చైతన్యం అంకురిస్తున్న ఆ తొలి రోజులలో ఆనంద మోహన్ బోస్, సురేంద్రనాథ్ బెనర్జీ అనే ఇరువురు మహావక్తలు నడుపుతున్న 'ఇండియన్ అసోసియేషన్' కార్యకలాపాలు పాల్ వ్యక్తిత్వానికి రూపరేఖలు దిద్దాయి.

బ్రాహ్మో సమాజ నాయకుడూ, సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసుడూ అయిన పండిత శివనాథశాస్త్రి కుమార్తెను బిపిన్ చంద్ర పాల్ వివాహ మాడాడు.

బ్రతుకు తెరువు కోసం బడిపంతులు, ప్రయివేట్ ట్యూటర్ వంటి ఎన్నో అవతారాలెత్తాడు పాల్. అయితే - ఆయన మనస్సు ఎప్పుడూ రచనా వ్యాసంగంవైపే, వక్తృత్వం వైపే మొగ్గు చూపుతూ ఉండేది. 'లాహోర్' నుంచి వెలువడే 'ది ట్రిబ్యూన్' అనే పత్రికలో సహాయ సంపాదక పదవి లభించడంతో ఆ రంగంలో ఆయనకు మొట్టమొదటి సారిగా ఒక మంచి అవకాశం లభించిన ట్లయింది. అనతి కాలంలోనే ఒక

---

## కృత్రిమంగా పొదిగిన తాబేటి గుడ్లు



చరిత్రలో మొట్ట మొదటి సారిగా కటక్ (ఒరిస్సా) సమీపంలోని భీతర్ కణికావద్దఉన్న 'గహిర్ మాతా రీసెర్చ్ సెంటర్' లో 'ఆలివ్‌రిడ్లీ' జాతి తాబేటి గుడ్లను కృత్రిమంగా పొదిగి, నిర్బంధంలో పెంచుతున్నారు. ద. పసిఫిక్ సముద్రం నుంచి ఈ తాబేళ్ళు గుడ్లు పెట్టడానికి ఏటా గుంపులు గుంపులుగా ఒరిస్సా తీరానికి వస్తున్నాయి. ఇటీవల వేట పక్షులవల్లా, వన్య మృగాలవల్లా, మానవుల వల్లా వీటికి ఎక్కువ ప్రమాదం ఏర్పడింది.

"జీవితం అంటే గడచిన ఏళ్ళు కాదు: సాధించిన సత్కార్యాలు!" — బెయిలీ

ప్రముఖ పత్రికా రచయితగా ఆయన పేరు పొందాడు లాహోర్‌లో ఉద్యోగం వదలి స్వరాష్ట్రానికి తిరిగి రాగానే పాల్ కలకత్తా పబ్లిక్ లైబ్రరీకి లైబ్రేరియన్‌గానూ, సెక్రటరీ గానూ నియమించబడ్డాడు. 1898 లో మొదటిసారి ఆయన ఇంగ్లండ్ వెళ్ళి హిందూ మతాన్ని గురించి అక్కడ ఉపన్యసించే అవకాశం లభించింది. 'ది బ్రిటిష్ యూనిటేరియన్ సొసైటీ' వారు అందుకు కావలసిన ఏర్పాట్లు చేశారు. బ్రిటిష్ మిత్రుల సహకారంతోనే అమెరికా నుంచి కూడా 'లెక్చర్ టూర్' కి ఆయనకు ఆహ్వానం వచ్చింది.

అమెరికాలో ఉపన్యాసాలు చెబుతూ పర్యటిస్తున్న రోజులలో ఒక అమెరికన్ నాయకుడు నిర్మొహమాటంగా కుండ బద్దలు కొట్టినట్టు ఆయనకు చెప్పాడు; "నీ దేశం దాస్యంలో అలమటిస్తూ ఉంటే నువ్వు విదేశాలలో పర్యటించడం కంటె అసందర్భం ఏదీ లేదు. రాజకీయంగా బానిసతనంలో ఉన్న నీ లాటి వ్యక్తి చెప్పే మాటలు ఎవ్వరూ తీవ్రంగా పట్టించుకోరు!" ఆ మాటలు బిపిన్ చంద్ర పాల్ హృదయంలో గాఢంగా నాటుకు పోయాయి. స్వదేశానికి తిరిగి వచ్చిన మరుక్షణం నుంచీ భారత స్వాతంత్ర్యోద్యమానికి ఆయన పూర్తిగా అంకితం అయిపోయాడు. 'న్యూ ఇండియా' అనే వార పత్రిక స్థాపించి, కాంగ్రెస్ ఉద్యమాన్ని తీవ్రతరం చేయవలసి ఉన్న ఆవశ్యకతను గురించి గర్జిస్తూ వారం వారం వ్యాసాలు వ్రాసేవాడు. నాటి వైస్రాయి లార్డ్ కర్జన్ బెంగాల్ విభజనకు పూనుకోడం వల్ల దేశం అంతటా చెలరేగిన 'స్వదేశీ ఉద్యమం'లో తల మున్కలుగా ఆయన పాల్గొన్నాడు.

1906 లో జరిగిన కలకత్తా కాంగ్రెస్

---

## రెండుసార్లు 'ఎవరెస్ట్' ఎక్కిన ఏకైక వ్యక్తి



నవాంగ్ గోంబూ ఒక్కడే ప్రపంచంలో ఎవరెస్ట్ శిఖరం రెండు సార్లు అధిరోహించిన ఘనుడు. ఆక్సిజన్ సాయం లేకుండా 'నందా దేవీ' శిఖరం (ఎత్తు - 25.645 అ.లు) అధిరోహించిన తొలి భారతీయుడు కూడా అతడే! మొదటిసారి 1963 మే 21న జేమ్స్ విటాకర్ అనే ఒక అమెరికన్‌తో కలసి, రెండోసారి 1965 మే 20న భారత పర్వతారోహక బృందంతోనూ గోంబూ ఎవరెస్ట్ శిఖరం అధిరోహించాడు.

"చేసిన మేలు ఎన్నడూ గుర్తుంచుకోకు!
పొందిన మేలు ఎన్నడూ మరచిపోకు!" —ఖిలాన్

మహాసభలో బిపిన్ చంద్రపాల్ 'స్వదేశీ' అన్న మాటకు విపులమైన అర్థాన్ని కల్పిస్తూ మూడు ముఖాలుగా దానిని వ్యాఖ్యానించాడు: 1. స్వదేశీ వస్తువులపట్ల అభిమానం, 2. విదేశీ వస్తు బహిష్కరణ, 3. జాతీయ విద్యా బోధన.

విదేశీ పాలకులకు ప్రతికూలంగా సర్వతోముఖమైన ఉద్యమానికి పిలుపు నివ్వడంలో బాల గంగాధర తిలక్, లాలా లజపత్ రాయ్ లతో గొంతు కలిపి 'లాల్-బాల్-పాల్' అనే త్రిమూర్తులలో ఒకడుగా ప్రసిద్ధి పొందాడు. 1907 లో సూరత్ కాంగ్రెస్ మహాసభలో జాతీయ నాయకులలో ఏర్పడిన చరిత్ర ప్రసిద్ధమైన చీలికలో బిపిన్ చంద్ర పాల్ తిలక్ నాయకత్వం క్రింద విడిపోయిన అతివాద వర్గంలో ప్రముఖ పాత్ర నిర్వహించి, మితవాదులను తీవ్రంగా ఎదుర్కొన్నాడు.

బెంగాల్ రాష్ట్రంలో స్వదేశీ ఉద్యమాన్ని ప్రచారం చేసేందుకు అరవింద ఘోష్ ఆరంభించిన 'వందే మాతరమ్' (ఇంగ్లీష్) 'జుగాంతర్' (బెంగాలీ) అనే పత్రికలు నడపడంలో 'బిపిన్ చంద్ర పాల్' ఆయనకు కుడి భుజంగా ఉన్నాడు. అరవింద ఘోష్ మీద మోపిన రాజద్రోహ నేరం కేసులలో సాక్ష్యం ఇచ్చేందుకు నిరాకరించి, తత్ఫలితంగా 7 నెలలు కారాగార వాస శిక్ష పాల్ అనుభవించాడు.

బెంగాల్ బయట - ఇతర రాష్ట్రాలలో కూడా బిపిన్ చంద్రపాల్ విస్తృతంగా పర్యటించి సుడిగాలి లాంటి ఆయన అసాధారణమైన వక్తృత్వ ప్రతిభతో ప్రజలను ఉద్రూతలూగించాడు. ముఖ్యంగా ఆంధ్రదేశంలో రాజమండ్రి వంటి నగరాలలో ఆయన భీషణ గర్జనలకు ముగ్ధులైన యువకులు వేలాదిమంది తమ కాలేజ్ చదువులకు స్వస్తి చెప్పి స్వాతంత్ర్యోద్యమ హోమగుండంలోకి ఉరికారు. మచిలీపట్నంలో ఆయన వక్తృత్వం చేత ప్రభావితులైన డా. భోగరాజు పట్టాభి

(మిగతా 53 వ పేజీలో)

## నీలగిరి ఘాట్ రైలు రోడ్డు



మెట్టుపాళయం నుంచి ఉదక మండలాని (నీలగిరి)కి పోయే కి మీ. పొడవు గల మీటర్ గేజ్ రైలు మార్గాన్ని ఇటీవల పునర్నిర్మించారు. మొదట 1908 లో వేసిన ఈ రైలు మార్గంలో 249 వంతెనలూ, 208 వంపులూ, 16 సురంగ మార్గాలూ ఉన్నాయి. వెనుక నుంచి ఆవిరి ఇంజన్‌తో నెట్టబడే ఈ రైలు పట్టాల మధ్య పళ్ళచక్రాలు అమర్చబడ్డాయి. ఇంత నిటారుగా ఉండే రైలు మార్గం ఒక్క స్విట్జర్లండ్ లో తప్ప ప్రపంచంలో మరి ఎక్కడా లేదు.

"ఓర్పుగా అనుభవించడం, హుందాగా ప్రవర్తించడం,
ప్రశాంతంగా జీవించడం - ఇదే జీవిత లక్ష్యం!" —స్వామీ రామదాస్

# జీవితం నేర్పిన పాఠాలు

ఎన్. మహాలింగం



[శ్రీ ఎన్. మహాలింగం తమిళనాడులో దారిద్ర్యాన్నీ, ఆకలినీ అంతమొందింపడానికి దీక్ష వహించిన ప్రముఖులలో ఒకరు. వ్యావసాయికమైన ముడిసరుకులను విలువ గల వస్తువులుగా మార్చే చిన్న చిన్న వ్యావసాయిక పరిశ్రమల నెన్నిటినో ఆయన స్థాపించారు. ప్లానింగ్‌లో దేశాభ్యుదయానికి ప్రాధాన్యం ఇచ్చే ఆయన పద్ధతులు అన్ని ప్రముఖ రాజకీయ పక్ష నాయకులనూ ఆకర్షించాయి. 'కిసాన్ వరల్డ్' అనే ఇంగ్లీషు మాస పత్రికకూ, 'ఓమ్‌శక్తి' అనే తమిళ మాస పత్రికకూ గౌరవ మేనేజింగ్ ఎడిటర్ ఆయన.]

'అనుభవాన్ని మించిన గురువు లేడు' అని ఆర్యోక్తి. 'అనుభవపు' పాఠశాలలో మనిషి అమూల్యమైనపాఠాలు నేర్చుకుంటాడు. ప్రతి వ్యక్తి జీవితమూ ఒక గొప్ప అనుభవమే; అయితే-తరుచు ఆ అనుభవం విలువను వ్యక్తి చాలా ఆలస్యంగా గుర్తిస్తూ ఉంటాడు.

---

## భావ పరిచయ పోటీ

(ఆగస్టు 1984)

★

"ముక్తి కోసం భక్తి
భుక్తి కోసం కక్కుర్తి!"
—గండిపాటి నానారావు,
అచ్చంపేట (గుంటూరు జిల్లా)

* * *

"ఇదీ నేటి మనిషి భక్తి-
ఏనాటికో ఈ మనిషికి ముక్తి!"
—పి. పద్మారావు, మద్దూరు (ప.గో.జిల్లా).

* * *

"దైవ భక్తి జాస్తి;
పాపభీతి నాస్తి!"
—బి. వి. ఆర్. భాస్కరరావు,
కుంకలగుంట (గుంటూరు జిల్లా)

"అనంతమైన సౌందర్యానికి నిలయం ఈ ప్రపంచం;
అయినా ఒక్కడూ దానిని పట్టించుకోడు!" —థామస్ ట్రాహెర్నె

పెద్దవాళ్ళు తమ అనుభవ సారాన్ని చెబుతూ ఉంటే ఛాదస్తపు కబుర్లుగా మనం వాటిని త్రోసివేస్తూ ఉంటాము. మనకు స్వయంగా ఆ పరిస్థితులు ఎదురైనప్పుడుగాని వారు చెప్పిన మాటల విలువ మనకు తెలిసిరాదు. 'అనుభవపు' పాఠశాలలో మనకు పాఠాలు వంటబట్టేసరికి మన తలలు నెరసిపోతాయి. అప్పటికే వాటిని ఆచరణలో పెట్టే తరుణం మించిపోతుంది. ఇలాంటి ఇబ్బందులు కొన్ని ఉన్నా, 'అనుభవం' విలువ కొట్టివేయరానిది.

కాల క్రమేణ పాతవిలువలు అంతరిస్తూ ఉంటాయి. వాటి స్థానంలో కొత్త విలువలు రావు. 1950 లలో కంటె, 1960 లలో కంటె 1980 లలో మన పరిస్థితి మెరుగుగా ఉందా అంటే, ఉంది అని ధైర్యంగా మనం చెప్పలేము. ఈ దృష్టితోనే నేను గతకాలాన్ని నెమరు వేసుకుంటూ ఉంటాను.

రాజకీయాలలో మహాత్మా గాంధీగారి లక్ష్యాలను వదిలి మనం చాలాదూరం వచ్చాం. పంచాయితీ స్థాయినుంచి ప్రజలే అధికారం పూర్తిగా చలాయించా లనీ, వారు ఇవ్వడం వల్లనే క్రిందనుంచి మీదివారికి క్రమంగా అధికారం సంక్రమించా లనీ గాంధిజీ ఆశయం. ఆయన దృష్టిలో నిజమైన ప్రజాస్వామ్యంలో ప్రతి శాసన సభ్యుడూ సత్యాన్నీ, అహింసనూ పాటించాలి. ప్రజలకు తాను నాయకుణ్ణని అనుకోకూడదు. ఆ ప్రజలే కొన్ని ఆదేశాలిచ్చి తనను శాసన సభకు పంపా రని గుర్తుంచుకోవాలి. ఆ ఆదేశాలను అమలు జరుపడానికి తీవ్రంగా కృషి చేయాలి. 1951 నుంచి 1964 దాకా వరుసగా 3 టరమ్‌లు తమిళనాడు రాష్ట్ర శాసన సభలో నేను శాసన సభ్యుడుగా ఉన్నాను. గాంధీజీ ఆశయాలను అమలు జరుపడానికి నా శక్తివంచన లేకుండా కృషి చేశాను. కోయంబత్తూరు జిల్లాలోని 'పొల్లాచి' నా నియోజక వర్గం. ఆ నియోజక వర్గంలోని ప్రజలలో నేను ఎరుగని వ్యక్తి ఒక్కరు కూడా లేరు; అలాగే - అక్కడ నన్ను ఎరుగని వారూ ఎవరూ లేరు.

కేంద్ర, రాష్ట్ర, మునిసిపల్, పంచాయితీ

## విస్కీ తాగే పిల్లి ప్రతిభ



రోజూ విస్కీ సేవించే తన పిల్లి 'టౌసర్' గత 20 ఏళ్ళలో 22,126 ఎలుకలను చంపిందని ఆ పిల్లిని పెంచుతున్న యజమాని గ్లాస్కో (బ్రిటన్)లోని ఒక స్కాచ్ విస్కీ దుకాణదారుడు ప్రకటించాడు. అంతకు ముందు రికార్డు కంటె ఇది 126 ఎలుకలను ఎక్కువగా సంహరించిం దట!

"స్వేచ్ఛా సమాజంలో హక్కులలోనూ, అవకాశాలలోనే సమానత్వం: వ్యక్తిగత సామర్థ్యాలలో మాత్రం అసమానతే!" —విలియమ్ బి. బెంటన్

ఎన్నిక లన్నీ ఏకకాలంలో ఒకే రోజు జర గడం అవసరం అని ఆ రోజులలో నేను దృఢంగా విశ్వసించే వాణ్ణి. మధ్యంతరపు ఎన్నికలు అవసరం వచ్చినప్పుడు జరుపుకో వచ్చును. మునిసిపాలిటీలకు 2½ ఏళ్ళ కొక సారి ఎన్నికలు జరగాలి శాసనంలో నిర్దిష్ట మైన రోజునే అవి జరగాలి. అనుకోని ఉప ద్రవం ఏదో ముంచుకొచ్చిన ప్రత్యేక సంద ర్భంలో తప్ప కచ్చితంగా నిర్ణయించిన రోజునే ఎన్నికలు జరిగి తీరాలి.

ప్రస్తుత కాలంలో రాజకీయ పక్షాలు ఎన్ని కల ముందూ, తరువాతా కూడా ఎన్నెన్నో సభలు జరుపుతూఅమూల్యమైన తమ కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నాయి. వెనుకటి రోజు లలో అంటే ఆకాశవాణి, దూరదర్శన్ ఇంతగా అభివృద్ధి చెందలేదు గనుక అప్పుడు సభలు జరుపడంలో అర్థం ఉంది. కాని, ఇప్పుడు పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. ఎన్నిక ముగియగానే ఊరేగింపులూ, బహి రంగ సభలూ జరపడం పూర్తిగా అనవసరం. నెగ్గిన వాళ్ళు వోటర్లకు కృతజ్ఞత పత్రికల ద్వారానో, రేడియో ద్వారానో తెలియజేయ వచ్చును. రోడ్లమీదా, నాలుగు వీథులు కలిసే కూడలి స్థలాల్లోనూ-ముఖ్యంగా నగరాలలో- జనాన్ని చేర్చి ట్రాఫిక్‌కి విఘాతం కలిగించే ఈ దురాచారానికి స్వస్తి చెప్పడం అవసరం. నిజానికి అది మన కాలాన్నీ, శక్తినీ దుర్విని యోగం చెయ్యడమే తప్ప దానివల్ల ఎలాంటి ప్రయోజనమూ సిద్ధించదు. మరీ అవసరం అనుకుంటే అటువంటి సభలను ఆదివారం లాంటి సెలవురోజున ఏ పబ్లిక్ హాలులోనో ఏర్పాటు చేసుకోవాలి.

మన విద్యా విధానాన్ని గురించి కూడా నా అనుభవం నాకు కొన్ని పాఠాలు నేర్పింది. గాంధీజీ మాతృభాష ద్వారానే విద్యాబోధన జరుగా లని పట్టుబట్టేవారు. ఇంగ్లీష్ భాష అంటే ఆయనకు ద్వేషం ఏమీ లేదు. కాని ఇంగ్లీష్ భాష సంఘంలో ఉన్నత వర్గాలవారి భాష అనీ, ఆంగ్లం ద్వారా విద్యాబోధన జరి గితే పై వర్గాల వారు క్రింది వర్గాల వారిని అణచి వేసేందుకు దోహదం ఏర్పడుతుందనీ

## 1984 ప్రపంచ సుందరి



1984 జూలై 9వ మియామీ (అమె రికా)లో జరిగిన 'ప్రపంచ సుందరి' పోటీ లలో 21 ఏళ్ళ వయస్సు గల స్వీడెన్ సుందరి 'యువోనె రైడింగ్' 1984 ప్రపంచ సుందరిగా ఎన్నికైంది.

"ప్రశ్న అడిగేవాడు ఆ క్షణంలో మాత్రమే మూఢుడు.
అసలు ప్రశ్నలు అడగనివాడు జీవితం అంతా మూఢుడే!"

ఆయన భయం. అంతే కాదు. బ్రిటిష్ విద్యా విధానం వృత్తి కౌశలాలకు ప్రాధాన్యం ఇచ్చేది కాదు. గాంధీజీ నిర్యాణానంతరం ఇన్నేళ్ళకు ఇప్పుడు ఇండియాలో విద్యా విధానం సామాన్య మానవుడికి అందుబాటులో లేనంత వ్యయంతో కూడిం దని జనం గుర్తిస్తున్నారు. నగర, గ్రామీణ జనాభాల మధ్య ఉన్న అఖాతం మీద వంతెనలు నిర్మించడం అవసరం. మాతృ భాషద్వారా విద్యా బోధన జరిగినప్పుడే ఇది సాధ్యం అవుతుంది.

మన విద్యా విధాన సంస్కరణకు నేను చేసే సూచనలు: 1. హైస్కూలు చదువు ముగిసే వరకూ ప్రభుత్వ, ప్రభుత్వేతర పాఠశాల లన్నిటిలోనూ విద్యాబోధన ఏకరూపంగా ఉండాలి. 2. ఆ స్థాయిలో పూర్తిగా మాతృ భాషలోనే విద్యాబోధన జరగాలి. 3. బాల బాలికలకు ఆ దశలో వృత్తి కౌశలాలను కూడా అలవరచాలి.

దానివల్ల చదువుకుంటూన్న రోజుల్లోనే ధనార్జన చేయగల అవకాశం పేద విద్యార్థులకు లభిస్తుంది. ఇండియా ప్రజలలో దారిద్ర్యాన్ని నిర్మూలించడం గాంధీజీ అభిమతం. ప్రజల కుపయోగించే వస్తువుల ఉత్పత్తినే గాని, భారీ ఉత్పత్తిని గాంధీజీ వ్యతిరేకించారు. 1925 లో ఇండియాలో దారిద్ర్యరేఖకు దిగువను జీవించేవారు 25 శాతం మాత్రమే ఉంటే, 1945 నాటికి 35 శాతానికీ, ప్రస్తుతం 52 శాతానికీ అది పెరిగింది. ఇంతకంటె దారుణం ఏం కావాలి?

స్వరాజ్యం వచ్చిన తరువాత భారీ పరిశ్రమ లెన్నో ఇండియాలో వెలిశాయి. తత్ఫలితంగా నిరుద్యోగుల సంఖ్య పెరిగింది. జన సామాన్యాన్ని పీడించడం తగ్గుముఖం పట్టడానికి బదులు మరింత పెచ్చు పెరుగుతూ

(మిగతా 56 వ పేజీలో)

## మిక్కిలి చిన్నతనంలోనే చదరంగంలో అందెవేసిన చేయి



ప్రస్తుతం అంతర్జాతీయ చదరంగం ఆటగాళ్ళలో ప్రత్యర్థులకు గుండె దడ కలిగించే కొద్ది మందిలో రష్యాకు చెందిన మాయా చిబర్దానిడ్జె ఒకరు. తన 22 వ ఏటనే ఆమె చదరంగం ఆడే స్త్రీలలో ప్రపంచ ఛాంపియన్ అయింది. తన 13 వ ఏటనే ఆమె ఇంటర్నేషనల్ మాస్టర్ గౌరవం పొందింది. జార్జియాలో వైద్య విద్యార్థినిగా ఉన్న చిబర్దానిడ్జె గుండె జబ్బుల చికిత్సలో ప్రత్యేక ప్రావీణ్యం గడిస్తున్నారు.

"స్కూళ్ళలో, కాలేజీలలో 10, 15 ఏళ్ళు గడిపి సాధిస్తున్నది కేవలం కొన్ని మాటలు; సారవంతమైనది ఒక్కటీ లేదు." —ఎమర్సన్

# ప్రపంచ నగరాలు

## ఢిల్లీ పట్టణం

పురాణ గాథలను బట్టి మహాభారత కాలంలోనే ఢిల్లీ మొట్ట మొదటిసారిగా ఇండియా రాజధాని నగరం అయినట్టు తెలుస్తూంది. నేటి ఇంద్రప్రస్థం (పురాణా ఖిల్లా-



కుతుబ్ మినార్




ప్రాచీనపు కోట) ప్రాంతంలో మహాభారత కాలం నాటి రాజధాని నగరం ఉండేదట. చారిత్రకంగా 11 వ శతాబ్దం మధ్య భాగంలో తోమార్ రాజపుత్రుల చేత మొట్ట మొదట ఈ పట్టణం నిర్మించబడినట్టు చెబుతున్నారు.

ఢిల్లీలో 13 వ శతాబ్దంలో నిర్మించబడిన సుప్రసిద్ధమైన కుతుబ్ మినార్ స్తంభంపైకి ఎక్కి చూస్తే ఢిల్లీ పరిసరాలలో పాచిన

### పన్ను కట్టు!

ఐశ్వర్యం విలువుకో—ఐశ్వర్యం పన్ను కట్టు!
దానం చెయ్యి—'గిఫ్ట్ టాక్స్' కట్టు!
ఖర్చు పెట్టు—'వ్యయం' పన్ను కట్టు!
మరణించు—మరణ సుంకం కట్టు!

"విదూషకుడి అదృష్టం అతని శ్రోతల చెవుల మీద ఆధారపడి ఉంటుంది!" —షేక్స్పియర్

నగరాల తాలూకు వివిధ శిథిలాలు కనిపిస్తాయి.

ఒక ఉద్యాన వనం మధ్య నిర్మితమైన కుతుబ్ మినార్ అత్యద్భుతమైన కట్టడం. ఒక జయ స్తంభంగానూ, ఒక ముస్లిం ప్రార్థనా మందిరం (minaret) గానూ నిర్మించబడిన ఈ కట్టడం ఎత్తు 72.5 మీటర్లు (234



ఫిరోజ్‌షాకోట్లా అశోక స్తంభం

అ. లు). స్ప్రింగ్ ఆకారంలో తీర్చబడిన 379 మెట్లమీదుగా స్తంభం పైభాగానికి చేరుకోవచ్చును. కుతుబ్ మినార్ చుట్టూ కని పించే శిథిలాలే మొట్టమొదటి ఢిల్లీ నగరం. అనంగపాల్ తోమార్ అనే ఒక రాజపుత్ర నాయకుడు క్రీ. శ. 1050 ప్రాంతంలో అక్కడ 'లాల్ కోట్' నిర్మించాడు. ఆ పరి సరాలలో ని పెద్ద ఆవరణా, సగం పడి పోయిన గోడలూ 1 96 లో కుతుబ్-ఉద్-దీన్ ఐబక్ నిర్మించిన 'కువ్వాతుల్-ఇస్లామ్' అనే మసీదు తాలూకు అవశేషాలు. ఆ మసీదు ఆవరణలోనే సుప్రసిద్ధమైన అశోకుని కాలం నాటి ఇనుప స్తంభం కనిపిస్తుంది. ఇది ప్రపంచంలోని అద్భుతమైన వింతలలో ఒకటి. దీనిలో 99.75 శాతం స్వచ్ఛమైన ఇనుము. క్రీ. శ. 4 వ శతాబ్దినాటి దని చెప్ప బడుతూన్న ఒక శాసనం ఈ ఇనుప స్తంభం మీద చెక్కబడి ఉంది. బహుశః మధుర



పురాణా ఖిల్లా

నుంచి కుతుబుద్దీన్ ఢిల్లీకి తీసికొని వచ్చిన ఈ ఇనుప స్తంభం ఎన్ని శతాబ్దాలు గడచినా తుప్పు పట్టడం గాని, అరిగిపోవడం గాని జరుగక పోవడం ఆధునిక శాస్త్రవేత్తలకు విభ్రాంతి కలిగిస్తూంది.

కుతుబ్ మీనార్‌కు ఈశాన్య దిశగా 'సిరి'

## 1,000 మీటర్ల ఎత్తున్న లవణ పర్వతం

మానవ జాతికి 100 ఏళ్ళ పాటు ఉప్పును సరఫరా చేయగల ఒక 1,000 మీటర్ల ఎత్తున్న లవణ పర్వతాన్ని రష్యాలో తజికి స్థాన్‌లోని కుల్యాబ్ ప్రాంతంలో కను గొన్నారు.

"ఆత్మకు 'ప్రకృతి' తో వివాహం జరిగితే బుద్ధి ఫలిస్తుంది, 'భావన' పుడుతుంది!" —హెచ్.డి. థోరో

నగర శిథిలాలు కనిపిస్తాయి. అది రెండో ఢిల్లీ నగరం. క్రీ. శ. 1300 ప్రాంతంలో ఖిల్జీలు నిర్మించింది. మూడో ఢిల్లీ తుగ్లకాబాద్. ఒక పెద్ద కోటతోనూ, జాగ్రత్తగా భద్రపరచబడిన ఘియాజుద్దీన్ తుగ్లక్ సమాధితోనూ కూడిన ఈ నగరం తాలూకు శిథిలాలు కుతుబ్ మినార్‌కు తూర్పుగా 8 కి. మీ. ల దూరాన ఉన్నాయి. తుగ్లకాబాద్



ఎర్ర కోట

సమీపంలోనే 'జహాపనాహ్' అనే నాలుగో ఢిల్లీ నగరం వెలసింది. ప్రస్తుతం అక్కడ 'విజయ్ మండల్' అనే ఎత్తైన ఒక కట్టడం నిలిచి ఉంది.

అయిదో ఢిల్లీ నగరం ఫిరోజాబాద్. 1354 లో ఫిరోజ్ షా చేత నిర్మితమైన ఈ నగరం నేటి కొత్త ఢిల్లీకీ, చుట్టూ ప్రాకారం గల పాత ఢిల్లీకీ మధ్యలో ఉండేది. అశోకుని శిలా స్తంభం ఒకటి ఇప్పుడు అక్కడ కనిపిస్తుంది. నున్నగా చేసిన ఇసుక రాతితో నిర్మించబడ్డ, క్రీ.పూ. 3 వ శతాబ్ది నాటి, 43 మీటర్ల ఎత్తున్న ఈ శిలా స్తంభం బరువు 23 టన్నులు. నేటి హర్యానాలోని అంబాలా సమీపాన ఉన్న 'తోప్రా' నుంచి మోజుపడి ఫిరోజ్‌షా తుగ్లక్ దానిని ఢిల్లీకి చేర్పించాడు. 200 కి. మీ. ల దూరం దానిని తీసుకుని వచ్చి ఆ నాటి ఢిల్లీ నగరంలో ప్రతిష్ఠించాడు.

ఆరో ఢిల్లీ నగరం ప్రస్తుతం 'పురానా ఖిల్లా' లేదా ఇంద్రప్రస్థం అనబడే ప్రాంతం చుట్టూ వెలసింది. ఆ నగర నిర్మాణాన్ని మొగల్ చక్రవర్తి హుమాయూన్ ప్రారంభించగా షేర్ షా (1540-45) దానిని పూర్తి చేశాడు.

ఏడో ఢిల్లీ నగరం నేటి పాత ఢిల్లీ. పూర్వం దీనిని 'షాజహానాబాద్' అనేవారు. అందమైన పాలరాతి ప్రాసాదాలతోనూ, ప్రపంచ ప్రసిద్ధమైన మసీదులతోనూ కూడిన ఈ నగరాన్ని 17 వ శతాబ్ది మధ్య భాగంలో కోటికి పడగెత్తిన మొగలాయీ చక్రవర్తి షాజహాన్ నిర్మించాడు.

---

## చైనాలో ఎక్కువ కాపీలు చెల్లిన పుస్తకం

చైనా కమ్యూనిస్ట్ పార్టీ ప్రముఖ నాయకుడు డెంగ్ క్సియావో పింగ్ రచనల సంకలనం అయిన 393 పేజీల గ్రంథం గత సంవత్సరంలో ఎక్కువ కాపీలు చెల్లిన గ్రంథంగా ప్రకటించబడింది. దాని కాపీలు 5.4 కోట్లు ఖర్చయాయి.

"అరుదుగా కలిసి వచ్చే అదృష్టాల వల్ల కంటె చిన్న చిన్న దైవిక లాభాలవల్లే మనిషికి ఎక్కువ ఆనందం!" — బెంజమిన్ ఫ్రాంక్లిన్

ఎనిమిదో ఢిల్లీ నగరం బ్రిటిష్‌వారు నిర్మించింది. అదే నేటి క్రొత్త ఢిల్లీ: 1920-30 సం. ల మధ్య నిర్మించబడింది. అయితే నిజానికి దానికి ఈ నాటి అందమైన, విస్తృత మైన రూపం ఏర్పడడం 1947 లో భారత రాలలో గొప్ప గొప్ప ప్రాసాదాలు ఎన్నో వెలిశాయి. 'చాందినీ చౌక్'లోని ఆ నాటి వెండి, బంగారు పనివారు లాంకషైర్ (ఇంగ్లండ్)లోని నూలు మిల్లులు తీసే

(మిగతా 43 వ పేజీలో)



ఎర్రకోటలోని దివాన్-ఇ-ఖాస్

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాతనే జరిగింది.

పాత ఢిల్లీలోని ప్రధాన రాజవీథి 'చాందినీ చౌక్' వెండి వస్తువుల కొట్లకూ, బట్టల కొట్లకూ పేరు మోసింది. మొగలాయీ చక్రవర్తుల ఊరేగింపులు సాగేందుకు వీలైనంత విశాలంగా వెనుకటి రోజులలో ఆ వీథి ఉండేది. వీథి మధ్యభాగంలో ఒక కాలువ పారుతూ ఉండేది. ఆ వీథి పరిస

## సంగీతం పాడే బ్లాక్ బోర్డు

1973 లో ఒక బ్రిటిష్ సంస్థ పిల్లలకు సంగీతం నేర్పడం కోసం ఒక సంగీతం పాడే బ్లాక్ బోర్డ్‌ను తయారుచేసింది. బోధకుడు స్వరాలను ఒక ఎలెక్ట్రానిక్ బోర్డ్ మీద వ్రాసి ఒక ప్రత్యేక 'దర్శిక' (pointer) తో ఏ స్వరాన్ని నొక్కితే ఆ స్వరం వినిపిస్తూ ఉంటుంది.

"ఆరోగ్య పోషణకు రోజూ కొంత సమయం వెచ్చించకపోతే జబ్బుపడి చాలా సమయం కోల్పోవలసి రావచ్చు!" — సెబాస్టియన్ నైప్

# చిట్టిదేవతలకు చిన్నకథలు

## శిబి చక్రవర్తి - పావురం

స్వామీ జ్యోతిర్మయానంద

అనగా అనగా ఒకప్పుడు 'శిబి' అని ఓ గొప్ప చక్రవర్తి ఉండేవాడు. 'ఉశీనరుడు' అని కూడా ఆయనను అనే వారు. గొప్ప సత్య సంధు డనీ. మహాదాత అనీ, సర్వ సద్గుణ పరిపూర్ణు డనీ ఆయనకు ప్రసిద్ధి!



ఒక రోజున శిబి చక్రవర్తి కొలువు తీర్చి ఉన్న సమయంలో భయంతో గజ గజ వణికి పోతూ పావురం ఒకటి కిటికీలో నుంచి దూసుకుని వచ్చి ఆయన ఒళ్ళో వాలింది. చిత్రంగా మనుష్య భాషలో - "రక్షించు! మహారాజా! నాకు వేరే అండలేదు. నిన్ను శరణు వేడుతున్నాను" అని ప్రాధేయ పడింది. దయార్ద్ర హృదయు డైన రాజు పావురాన్ని ఓదారుస్తూ. "నీకు వచ్చిన భయం ఏమీ లేదు. నీ ప్రాణాలకు నా ప్రాణం అడ్డు!" అని అభయం ఇచ్చాడు.

ఆ మరుక్షణమే అదే కిటికీలో నుంచి అతి దూకుడుగా దూసుకు వచ్చింది ఒక డేగ. మంచి బలంగానూ, భయంకరంగానూ కని

### నవ్వు ముఖంతో కనిపించే లామా!

జమ్మూ కాశ్మీర్ రాష్ట్రంలోని లడక్ ప్రాంతంలో చూమూర్ లోయలో ఉన్న ఒక బౌద్ధ సన్యాసుల మఠంలో పవిత్రంగా, నవ్వుతూ కనిపించే ముఖంతో కూర్చుని ఉన్న ఒక లామా కనిపిస్తాడు. సమాధిలో ఉన్న ఒక యోగిలాగా పైకి కనిపించినా, నిజానికి ఆయన చనిపోయి 40 ఏళ్ళు అయింది.

"శరీరానికి వ్యాయామం ఎలాంటిదో
మనస్సుకు పుస్తక పఠనం అలాంటిది! —సర్ రిచర్డ్ స్టీల్

పించే ఆ డేగ రాజును బెదిరిస్తూ ఇలా అంది: "నా ఆహారాన్ని నాకు కాకుండా చేయడానికి ఎన్ని గుండెలు నీకు, రాజా?"

చిత్రంగా అదీ మనుష్య భాషలోనే మాట్లాడుతూ ఎన్నెన్నో ధర్మ పన్నాలు ఏకరువు పెట్టింది. పావురం తనకు సహజ సిద్ధమైన ఆహారం అనీ, తన పాలనలోని ప్రాణుల విధి విహితమైన ఆహారాన్ని అపహరించడం రాజు చేయ దగిన పని కాదనీ వాదించింది.

వినయంగా నవ్వుతూ ఆ డేగతో ఇలా అన్నాడు రాజు: "ఎంత చక్కగా ఉపన్యసించావు పక్షిరాజా! నీకు తెలియని ధర్మాలు అంటూ లేవు. మరి శరణు కోరిన వారిని శత్రువులకు వప్పజెప్పడం ధర్మమా? నువ్వే చెప్పు! ఆకలి గొని ఉన్న నీ ఆకలి తీర్చడం నా విధి. అందుచేత పావురం మాంసానికి బదులు వేరే ఏదైనా జంతువు మాంసాన్ని కోరుకో! పావురం ఎత్తు ఇతర జంతువుల మాంసం పెట్టి నీ ఆకలి తీరుస్తాను. అంతే గాని, శరణు వేడిన ఈ పావురాన్ని మాత్రం నీకు ఆహారంగా ఇవ్వలేను."

డేగ ససేమిరా అందుకు ఒప్పుకోలేదు. ఆ పావురం మాంసం తప్ప మరే జంతువు మాంసమూ తనకు అక్కర లేదంది. చివరికి ప్రాణం విసిగి రాజు అన్నాడు: "పోనీ! ఆ పావురం ఎత్తు మాంసం నా శరీరంలో నుంచి కోసి ఇస్తాను. దానిని స్వీకరించి ప్రాణ భయంతో గజగజ వణికి పోతున్న ఈ పావురాన్ని వదలిపెట్టు!" ఆ మాట కోసమే ఎదురు చూస్తున్నట్టుగా డేగ వెంటనే అందుకు వప్పుకుంది.

శిబి చక్రవర్తి ఒక తక్కెడ తెప్పించాడు. ఒక పళ్ళెంలో పావురాన్ని ఉంచాడు. తన శరీరంలో నుంచి ఒక్కొక్క ముక్క కోసి రెండో పళ్ళెంలో వేయడం మొదలు పెట్టాడు. కాని ఆశ్చర్యంగా ఎంత మాంసం కోసి వేసినా ఆ పావురం కూర్చున్న పళ్ళెం పైకి లేవడం లేదు. అప్పుడు శిబి చక్రవర్తి

---

## క్రిమి సంహారక ఔషధాలు పని చేయని దోమలు



102 దేశాలలో నివసిస్తున్న మానవ జాతిలో 40 శాతం మంది - అనగా దాదాపు 190 కోట్ల మంది-మలేరియా జ్వరానికి గురి అయే ప్రమాద పరిస్థితులలో జీవిస్తున్నారు. మలేరియా జ్వరాన్ని సంక్రమింప జేసే 'అనఫెలీస్' దోమ మీద క్రిమి సంహారక ఔషధాలు పని చేయడం లేదు. 'మెఫ్లోక్విన్', 'క్వింగ్ హౌసూ' అనే రెండు క్రొత్త మందులను ఐక్యరాజ్య సమితి తాలూకు సంస్థలు తయారు చేస్తున్నాయి. వైద్య శాస్త్ర నిపుణులు కూడా మలేరియా రాకుండా చేసే టీకా మందు కనిపెట్టడానికి కృషి చేస్తున్నారు.

"సోమరితనం 'శరీరపు' మూర్ఖత్వం:
మూర్ఖత్వం 'మనస్సు' సోమరితనం! —హ్యూమ్

తనే స్వయంగా వెళ్ళి ఆ రెండో పళ్ళెంలో కూర్చోడానికి సిద్ధం అయ్యాడు.

అప్పుడు డేగ రూపంలో వచ్చిన ఇంద్రుడు నిజ స్వరూపంతో ప్రత్యక్షం అయాడు. "మహారాజా! నేను ఇంద్రుణ్ణి ఈ పావురం అగ్ని దేవుడు. నీ ధర్మ బుద్ధిని పరీక్షించడానికి మేము ఈ రూపాలలో వచ్చాము. నీ ఔదార్యం, నీ దాన గుణం సాటి లేనివి. ముందు తరాల ప్రజలు నీ కథ తిరిగి తిరిగి చెప్పుకుంటూ, ధర్మాచరణలో నిన్ను ఆదర్శంగా గ్రహింతురు గాక! మాంసం కోయబడిన నీ శరీరం మళ్ళీ యథా ప్రకారంగా ఆరోగ్య వంతంగా రూపొందు గాక!" అంటూ ఇంద్రుడూ, అగ్ని దేవుడూ అంతర్ధానం అయారు.

ఇంద్రుడు అన్న మాటలు అక్షరాలా నిజం అయాయి. వేలకొద్దీ సంవత్సరాలు గడిచినా ప్రతి తరంలోనూ పిల్లలకు తల్లిదండ్రులు ఈ శిబి చక్రవర్తి కథ చెబుతూ వస్తున్నారు. భారతంలోనూ, ఇతర పురాణాలలోనూ ఈ కథను తిరిగి తిరిగి చదువుకుంటున్నారు. ముందు తరాలలో కూడా ఈ కథ భారతీయులలో ధైర్య సాహసాలనూ, ఆత్మశక్తినీ, త్యాగబుద్ధినీ పెంపొందింప జేస్తూనే ఉండగలదనడంలో ఎలాంటి సందేహం లేదు.

## చదువు సత్ ప్రవర్తన నేర్పాలి!

" 'చదువు' రెండు ప్రధానమైన పనులు చెయ్యాలి: ఒకటి-గ్రహణ శక్తిని పెంచాలి; రెండు-శీలం పెంపొందించాలి ఇవాళ మనకు మిగతా అన్నిటి కంటె ముఖ్యంగా కావలసింది - ధైర్యం, దృఢ విశ్వాసం, మంచి చెడ్డల వివేచన గల నైతిక నాయకత్వం!"

—ఎన్. ఏ. పాల్ఖీవాలా.

## 58 రోజులలో 5,479 మైళ్ళు పరుగెత్తిన ఘనుడు



ముర్షిదాబాద్ (ప. బెంగాల్) లోని ఒక నిరుపేద కుటుంబానికి చెందిన తీర్థకుమార్ ఫణి 58 రోజులలో 5.479 మైళ్ళదూరం—అంటే రోజుకి సగటున 94.3 మైళ్ళు పరుగెత్తి, ఆ విషయంలో కొత్త ప్రపంచ రికార్డ్ స్థాపించాడు. ఇంతకు ముందు 1836 లో నార్వేకు చెందిన ఎర్నెస్ట్ మెన్సన్ 59 రోజులలో 5,450 మైళ్ళు మాత్రమే—ఇస్తాంబుల్ నుంచి కలకత్తాకు-పరుగెత్తాడు. ఫణి 1982 డిసెంబరు 24న కలకత్తాలో బయలుదేరి ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కేరళ, తమిళనాడు లలో చాలా ప్రాంతాలమీదుగా పరుగెత్తి, 1983 ఫిబ్రవరి 20న కలకత్తా చేరుకున్నాడు.

"సమకాలీన సంఘపు వ్యామోహాలకు ప్రతికూలమైన అభిప్రాయాలను నిర్భయంగా ప్రకటించే వారు అరుదు!" —అల్బర్ట్ ఐన్‌స్టైన్

# ఎలా 2

## పక్షులు ఎలా ఎగురుతున్నాయి?

సాధారణంగా పక్షు లన్నిటి దేహం, ఎగర డానికి అనుకూలంగానే నిర్మించబడి ఉంటుంది. నిప్పుకోడి 'రియా', 'ఎమూ', 'కాసవేరీ' వంటి కొద్ది పక్షులు మాత్రమే



ఎగరలేవు. అవి నేలమీద పరుగెత్తుతాయి. పక్షుల ఎముకలు బోలుగా ఉండి గాలితో నింపడానికి వీలుగా ఉండడంవల్లా, పక్షుల శరీరం నిండా గాలితో నింపిన చిన్న చిన్న సంచులు (sacs) ఉండడంవల్లా అవి ఎగుర గలుగుతున్నా యని వెనుకటి రోజులలో భావించేవారు. కాని, ప్రస్తుతం శాస్త్రవేత్త లలో ఎవ్వరూ గాలి నింపిన బోలు ఎముకల వల్ల గాని. దేహంమీద ఉన్న గాలి తిత్తుల వల్ల గాని పక్షులు ఎగురుతున్నా యని అంగీక రించరు.

పక్షి ఆకారం పడవలాగ ఉంటుంది. పడవ వెన్ను దూలం లాగ దాని రొమ్ము ఎముక ఉపయోగ పడుతుంది. నీళ్ళలో పడవలాగానే గాలిలో పక్షి పయనిస్తుంది. అయితే - నీటికి ఉన్నంత నిరోధక శక్తి గాలికి లేని మాట నిజం: అయినా నీటిలోని పడవకీ, గాలిలో ఎగిరే పక్షికీ చాలా సామ్యా లున్నాయి.

రెక్కల సాయంతో పక్షి గాలిలో ముందుకు సాగుతుంది. పడవకులాగే పక్షికీ ఒక చుక్కాని ఉంది. దాని తోకే దాని చుక్కాని. ఆ చుక్కాని సాయంతో అది ఎటు కావాలంటే అటు తిరుగగలదు అయితే పక్షి సైజు దృష్ట్యా దాని రెక్కలకు గల శక్తి మనిషి భుజాల శక్తికంటె 240 రెట్లు ఎక్కువ అని మనం మరచిపోకూడదు. ●

---

## మందు బిళ్ళంత చిన్న ట్రాన్స్‌మిటర్

ఓహియో (అమెరికా) రాష్ట్రంలోని క్లీవ్ లాండ్‌లో బయో మెడి మెట్రిక్స్ శాఖ అధి పతి డా. కార్ల్ ఎంగర్ కేవలం అరగ్రాము బరువుండే మందు బిళ్ళంత చిన్న ట్రాన్స్ మిటర్ డిజైన్ చేశాడు. శరీరంలోని హృదయ స్పందన, రక్తపుపోటు, ఉష్ణోగ్రత, కండ రాల చలనం మొదలైన వాటిని ఇది గ్రహించి ప్రసారం చేస్తుంది. ఇది పంపే సంకేతాలను 50 అ. ల దూరాన ఉన్న మామూలు రేడియో సెట్‌లో మనం వినవచ్చును.

"ఎప్పుడూ జయమే సాధించే ఎదురులేని అస్త్రం ప్రేమ:" —సోదరి కన్సోలటా

# భారతీయ

# వి. ఓ. చిదంబరం పిళ్లై

ప్రముఖ తమిళ స్వాతంత్ర్య యోధులలో ఒకరైన శ్రీ వి. ఓ. చిదంబరం పిళ్లై తన ఐశ్వర్యం, ఆరోగ్యం, శక్తియుక్తులూ సర్వం దేశమాత సేవలో తృణప్రాయంగా అర్పించిన ధన్యజీవి! తమిళనాడులో సముద్ర తీరాన ఉన్న 'ట్యూటికొరన్' పట్టణ ప్రముఖ నాయకులలో ఒకరైన శ్రీ పిళ్లై 'దేశ సేవ ముందు, స్వార్థం ఆ తరువాత!' అని దృఢంగా విశ్వసించిన వ్యక్తి. అసాధారణమైన దేశభక్తి, అరుదైన గుండె నిబ్బరం, వీరోచితమైన ఆత్మ త్యాగం ప్రాధాన్యం వహించిన ఆయన జీవిత గాథ భారత స్వాతంత్ర్య సంగ్రామంలో తమిళులు చేసిన నిస్వార్థ సేవకు చక్కని నిదర్శనం!



వి. ఓ. చిదంబరం పిళ్లై

తిరునెల్వేలి జిల్లాలోని 'ఓటియపిడరమ్' అనే ఒక కుగ్రామంలో 1872 లో లోగనాద పిళ్లైకీ, పారమాయి అమ్మయార్‌కీ పుత్రుడుగా శ్రీ పిళ్లై జన్మించారు. కొన్నాళ్ళు ట్యూటికొరన్ లోనూ, ఇంకొన్నాళ్ళు తిరునెల్వేలి లోనూ ఆయన విద్యాభ్యాసం చేశారు. హైస్కూలు చదువు పూర్తి అయాక న్యాయశాస్త్రం చదివి 1895 లో ట్యూటికొరన్‌లో లాయర్‌గా ప్రాక్టీస్ ప్రారంభించారు. ఆయన తండ్రి లోగనాద పిళ్లై కూడా లాయరే! లాయర్‌గా చిదంబరం పిళ్లై తన పార్టీల పట్ల ఎంతో సానుభూతి చూపేవారు. హుందాతనంతోనూ, చురుకైన యుక్తులతోనూ కోర్టులో అందరి హృదయాలనూ ఆకట్టుకునే వారు. బీదా, బిక్కీ

"ముందుకు ముందుగా ప్లాన్ చేసుకోని వ్యక్తికి
గడపలోనే ఎదురవుతాయి - ఇక్కట్లు!" —కన్‌ఫ్యూషియస్

స్తే దమ్మిడీ ఫీజు పుచ్చుకోకుండా వారి కేసులు వాదించేవారు. గవర్నమెంటు జులుం, నిరంకుశత్వం కనిపించే కేసులలో ఎప్పుడూ గవర్నమెంట్‌కి వ్యతిరేక పక్షానే నిలబడి ఆయన పోరాడే వారు.

ఈ శతాబ్ది ఆరంభ కాలంలో బ్రిటిష్‌వారి పట్ల వ్యతిరేక భావం ఇండియా అంతటా తీవ్రంగా వ్యక్తమైంది. దేశంలోని నాయకు లందరూ మన ప్రజలకు మరిన్ని అధికారాలు, మరింత సౌభాగ్యం సాధించడం కోసం ఆందోళనలు జరిపేవారు. రాజకీయాలలో అతివాద భావాలు గల చిదంబరం పిళ్ళై 1907 లో సూరత్ (గుజరాత్) లో జరిగిన చరిత్రాత్మకమైన కాంగ్రెస్ మహాసభకు హాజరయారు. సునిశితమైన ఆయన బుద్ధి సూక్ష్మత, ఉరకలు వేసే ఆయన ఉత్సాహం చూసి లాలా లజపత్‌రాయ్, అరవింద ఘోష్ వంటి పెద్దలు ముగ్ధు లయారు.

సుబ్రహ్మణ్య శివ, నీలకంఠ బ్రహ్మచారి, వి.వి.ఎస్. అయ్యర్ లతో పాటుగా చిదంబరం పిళ్ళై కూడా తమిళనాడులో సాగిన ఉగ్రవాద ఉద్యమంలో అగ్రశ్రేణిలో నిలి చారు ఆయన ప్రసంగాలు బ్రిటిష్ వారికి గుండె బెదురు కలిగించాయి. అణచరాని ఒక అగ్నిపర్వతంలాగ ఆయన వారికి కనిపించారు.

ఆ రోజులలో ఇండియా ఓడ వర్తకం అంతా బ్రిటిష్ కంపెనీల చేతులలోనే ఉండేది చిన్న రేవు పట్టణమే అయినా "ట్యూటికోరన్"లో సముద్ర ప్రయాణీకుల రద్దీ, సరకుల రవాణా రద్దీ ఎక్కువగా ఉండేవి. సరుకుల రవాణాకు బ్రిటిష్ కంపెనీలు చాలా ఎక్కువ ఛార్జీలు వసూలు చేసేవి. భారతీయ వర్తకులకు ఆ ఛార్జీలు అతి భారంగా ఉండేవి. సరిగ్గా అలాంటి సమయంలో బ్రిటిష్ కంపె

## నిక్షేపంగా పని చేస్తున్న ఇన్సాట్ I - బి



ఇండియా ప్రయోగించిన బహుళార్థ సాధక కృత్రిమ ఉపగ్రహం ఇన్సాట్ I-బి తాను ముఖ్యంగా నిర్వర్తించవలసి ఉన్న మూడు విధులనూ అద్భుతంగా నెరవేరుస్తూంది. తంతి, తపాలా శాఖ వారు 1,000 దూరపు సర్క్యూట్‌లకు దానిని వాడుతున్నారు. వాతావరణ శాఖ వారికి ఇన్సాట్ ప్రతి రోజూ 60 దాకా రేడియో మీటర్ చిత్రాలను అందజేస్తూంది. టెలివిజన్ రంగంలో ప్రస్తుతం ఉన్న 45 ట్రాన్స్‌మిటర్‌లలోనూ 37 ఇప్పటికి ఇన్సాట్ I-బి ద్వారా పని చేస్తున్నాయి.

"నా దేశం కోసం అర్పించటానికి
నాకు ఒక్కటే జీవితం ఉందే అని నా బాధ!" —నాథన్ హేల్

సీల తీవ్ర ప్రతిఘటనను లెక్కపెట్టకుండా స్థానిక భారతీయ వర్తకుల సహకారంతో చిదంబరం పిళ్ళై 'స్వదేశీ స్టీమ్ నేవిగేషన్ కంపెనీ' స్థాపించారు



రూ. 10 ల షేర్లతో మొత్తం రూ. 10 లక్షల పెట్టుబడితో ఆ స్వదేశీ స్టీమ్ నేవిగేషన్ కంపెనీ స్థాపించబడింది ఆదినుంచీ ప్రజల సానుభూతీ, స్థానిక వర్తకుల ప్రోద్బలం ఆ కంపెనీకి ఉండేవి. అయినా, అంతవరకూ గుత్త అధికారం అనుభవిస్తూ వచ్చిన బ్రిటిష్ కంపెనీలు తమ శాయశక్తులా ఆ కొత్త కంపెనీని అణచి వేయాలని ప్రయత్నించాయి. బాగా అభివృద్ధి చెంది తగినంత ఆర్థిక సౌష్ఠవం కలిగి ఉన్న బ్రిటిష్ కంపెనీల క్రింద పొగ ఓడలు అనేకం ఉండేవి. కాని, చిదంబరం పిళ్ళై నడిపే 'స్వదేశీ' కంపెనీకి ఉన్నది - రెండే రెండు ఓడలు! అయినప్పటికీ ఆ కొత్త కంపెనీ నదురూ బెదురూ లేకుండా ఆ బ్రిటిష్ కంపెనీల సవాలును ధైర్యంగా ఎదుర్కొని, అంత తేలికగా అణచి వేయరానిదిగా తయారయింది

రేట్ల విషయంలో కొత్త కంపెనీతో పోటీకి దిగిన బ్రిటిష్ కంపెనీలు ట్యూటికొరన్ నుంచి సిలోన్‌లోని కొలంబోకు ప్రయాణంచేసే ప్రయాణికుల ఛార్జీని రూ. 6/- ల నుంచి ఒక్కసారిగా 12 అణాలకు తగ్గించాయి. తమ పోటీదారును వ్యాపార రంగంనుంచి తరిమికొట్టడం కోసం ఆ కంపెనీలు క్షుద్రమైన, నీచమైన పద్ధతులకు దిగజారాయి. చిదంబరం పిళ్ళై అద్భుత ధైర్యశాలి; అచంచల దేశభక్తుడు. చాలారోజులు ఆ విదేశీ కంపెనీల పోటీని ఆయన ధైర్యంగా ఎదిరించాడు. అయితే - బ్రిటిష్ షిప్పింగ్ కంపెనీల పట్ల పక్షపాతం చూపే ప్రభుత్వ అధికారుల ఆగ్రహానికి ఆయన గురి అయాడు. బ్రిటిష్ ప్రభుత్వాధికారులు ఆయనను ఎన్ని అగచాట్లపాలు చేసినా, ఆఖరువరకూ ఆయన ధైర్యంగా పోరాడారు. ఆయన స్థాపించిన ఆ కంపెనీని చివరికి మూసివేయవలసి వచ్చినా, భారతీయ నౌకా వాణిజ్యాన్ని రూపొందించేందుకు ఆయన వెలిగించిన ఉత్సాహజ్యోతి

## 'సర్ 754'

దివాన్ బహదూర్ సర్ తిరువాళయం గుడి విజయరాఘవాచార్య విదేశాలకు వెళ్ళినప్పుడు ఆయన పేరు పలుకలేక అక్కడివారు నానా హైరాణా పడేవారట! లండన్‌లో 'సవాయ్' హోటల్‌లో 754 వ నెంబరు గదిలో ఆయన దిగడం వల్ల అక్కడ 'సర్ 754' అని ఆయనను పిలిచేవారట!

---

"ముందు నిజం ఏమిటో తేల్చుకో - తరువాత దానిని
నీ ఇష్టం వచ్చినట్టు తారుమారు చేయవచ్చు!" —మార్క్ ట్వేన్

మాత్రం మలిగిపోలేదు. అనంతర కాలంలో అది మరింత బలం పుంజుకుంది.

విదేశీ యజమానుల దోపిడీకి గురి అవుతున్న భారతీయ కార్మికులను కూడా చిదంబరం పిళ్ళై సంఘటిత పరిచారు. ఆయన మీద కక్షతో ప్రభుత్వం ఆయనను ఒక రాజద్రోహ నేరంలో ఇరికించి యావజ్జీవ కారాగార వాస శిక్ష విధించింది. ఓర్పుతో, నిర్లిప్తతతో ఆ జైలుశిక్ష ఆయన అనుభవించారు. అత్యంత నిరాశా పూరితమైన పరిస్థితులలో కూడా ఆయన ధైర్యంగాని, ఆయనలోని శక్తి గాని రవ్వంత కూడా మొక్కవోలేదు.

చిదంబరం పిళ్ళైకు విధించిన శిక్ష కపితో విధించింది అని భావించిన ఆ నాటి ఇండియా 'సెక్రటరీ ఆఫ్ స్టేట్' జాన్ మోర్లీ స్వయంగా జోక్యం కలిగించుకుని పునర్విచారణ కోసం ఆ కేసును మద్రాసు హైకోర్టుకు పంపారు. హైకోర్టువారు యావజ్జీవ శిక్షను 6 ఏళ్ళ కఠిన శిక్షగా తగ్గించారు. సత్ప్రవర్తన కారణంగా కొంత శిక్ష తగ్గడంవల్ల ఆరేళ్ళూ పూర్తిగా ఆయన జైల్లో లేరు. 1911 లో ఇంగ్లండ్ రాజు పట్టాభిషేకం సందర్భంలో ఆయనను విడుదల చేశారు. ప్లీడర్‌గా ప్రాక్టీసు చేసే ఆయన హక్కును రద్దుచేయడంవల్ల ఆయన జీవనోపాధి కష్టం అయింది. చాలా కష్టం మీద చివరికి మళ్ళీ ఆయన ప్రాక్టీసు చేసేందుకు అనుమతించారు. కొంతకాలం మళ్ళీ ప్రాక్టీసు కొనసాగించారు. దానితో పాటుగా సంఘ సంక్షేమ కార్యక్రమాలలో కూడా ఆయన పాల్గొనేవారు. ట్రేడ్ యూనియన్ రంగంలో కూడా అడుగుపెట్టి, మద్రాసులోని పెరంబూర్ రైల్వే వర్కర్స్ యూనియన్‌కి అధ్యక్షు లయారు. అరవింద ఘోష్‌కి సన్నిహిత సహచరులలో ఒకరుగా ఉంటూ, కొన్నాళ్ళు 'వివేకవాణి', 'హిందూనేశన్' పత్రికలకు సంపాదకత్వ బాధ్యత వహించారు; ప్రజలలో జాతీయ భావ బీజాలను వెదజల్లారు.

జైల్లోనూ, బయటా కూడా బ్రిటిష్ ప్రభుత్వం చిదంబరం పిళ్ళైని కొన్నేళ్ళపాటు నానా యాతనల పాలు చేసింది. తత్ఫలితంగా ఆయన ఆరోగ్యం దెబ్బతింది. తరువాత కొద్ది కాలానికే 1936 లో ఆయన స్వర్గస్థు లయారు.

---

## రాకాసి గుమ్మడి పండు



ఇజ్రేల్‌లోని ఒక రైతు పండించిన 150 కి.గ్రా.ల బరువు గల ఒక రాకాసి గుమ్మడి పండు ఎత్తు ఒక మీటరు పైచిలుకు; దాని చుట్టు కొలత 2 మీటర్లు.

"నా 'నిరాశ' ఎంతైనా నేను భరించగలను;
కాని ఇతరుల 'ఆశ' భరించడం నావల్ల కాదు." —డబ్ల్యు. వాల్డ్

# మెరికల్లాంటి పిల్లల్ని గుర్తించడం ఎలా ?

గీతా ఆర్. లాల్, పి. హెచ్ డి.

ఎలాంటి వారు సహజ ప్రతిభ గల, మెరికల్లాంటి పిల్లలు అంటే? చదువులో చురుకుదనం, బుద్ధి సూక్ష్మత కనిపించే పిల్లలు మాత్రమే సహజ ప్రతిభ గలవారు (gifted)



అనుకోడానికి వీలులేదు. అనేక ఇతర విధాలుగా కూడా ఈ 'సహజ ప్రతిభ' వ్యక్తం కావచ్చును. యథార్థాలనూ, భావాలనూ, సంబంధాలనూ చక్కగా ఉపయోగించుకోడంలో సహజ ప్రతిభ ద్యోతకం అవుతుంది. కొన్ని కొన్ని ప్రత్యేక సామర్థ్యాలలో పిల్లల సహజ ప్రతిభ వెల్లడి అవుతుంది. సాంఘిక, భౌతిక, యాంత్రిక, భాషా, కళా, విద్యా, సంగీతాది వివిధ రంగాలలో ప్రత్యేక సామర్థ్యాలు గోచరిస్తాయి.

ఈ ప్రత్యేక సామర్థ్యాలు గల వారందరిలోనూ తరచు బుద్ధి సూక్ష్మత కూడా కనిపించే మాట నిజమే అయినా, బుద్ధి సూక్ష్మత లేకుండా కొన్ని ప్రత్యేక సామర్థ్యాలు కలిగి సహజ ప్రతిభను ప్రదర్శించే పిల్లలు కూడా కొంద రుంటారు. అందుచేత సహజ ప్రతిభను శంలో తోడ్పడే ఒక అంశం మాత్ర 'బుద్ధి సూక్ష్మత'. 'సహజ ప్రతిభ'ను అతిశయ బుద్ధి సామర్థ్యం, లేదా కాల్పనిక శక్తి (creative imagination) అని నిర్వచించవచ్చును. కొందరు పరిశోధకులు 'సహజ ప్రతిభ'ను పట్టుదల, లక్ష్యశుద్ధి, దీక్ష అని నిర్వచించారు.

మెరికల్లాంటి సహజ ప్రతిభగల పిల్లలకు ప్రత్యేకంగా తోడ్పడా లంటే ముందుగా

## ఆరోగ్యానికి కేరట్ దుంపలు

లివర్ జబ్బులతోనూ, అజీర్తితోనూ, రక్తహీనతతోనూ బాధపడే రోగులకు కేరట్ దుంపలు చాలా మంచివి. ఎదుగుదలకు కూడా అవి తోడ్పడుతాయి. మూత్ర పిండ వ్యాధులతోనూ, హృద్రోగంతోనూ బాధపడేవారు ఖనిజ లవణాలు ఎక్కువగా ఉన్న కేరట్ దుంపలను రోజూ తింటూ ఉండడం ఎంతైనా అవసరం. కళ్ళకూ, చర్మానికీ కూడా కేరట్ దుంపలు మేలు చేస్తాయి.

---

"అధిగమించవలసిన దూరాలూ, దాటవలసిన అడ్డంకులూ
**లేకపోతే ఈ జీవితం ఎంత నిస్సారం, ఎంత రస హీనం!" —పండిట్ నెహ్రూ**

అలాంటి వారిని గుర్తించడం అవసరం. విజయం సాధించలేని వారిలో, సంఘంతో సరి పుచ్చుకోలేని వారిలో, నలుగురికీ వంత పాడే లక్షణాలు లోపించిన వారిలో, తరచు ఏవో చికాకులు కొని తెచ్చుకుంటూ ఉండే వారిలో గల సహజ ప్రతిభ తేలికగా మన దృష్టిలో పడకుండా పోయే ప్రమాదం ఉంది.

సహజ ప్రతిభ గల పిల్లలను గుర్తించ డానికి ప్రధానంగా తోడ్పడే అంశం: ఉపా ధ్యాయుని నిశిత పరిశీలన. సహజ ప్రతిభ గల పిల్లలు సాధారణంగా ఏ విషయాన్నైనా తేలికగానూ, తొందరగానూ నేర్చుకుంటారు. ప్రతి విషయమూ తర్కిస్తారు, స్పష్టంగా ఆలోచిస్తారు; సంబంధాలను గుర్తించి అర్థాన్ని అవగాహన చేసుకుంటారు; విన్న దానినీ, చదివిన దానినీ ఎక్కువ సార్లు పున శ్చరణ అవసరం లేకుండా గుర్తు పెట్టు కొంటారు; తోటి పిల్లలకు తెలియని విష యాలు చాలా వారికి తెలిసి ఉంటాయి; ఎక్కువ పదజాలాన్ని అనాయాసంగానూ, నిర్దుష్టంగానూ వారు వాడుతారు. తమ తరగతి కంటె 1, 2 సంవత్సరాల మీది తరగతుల పుస్తకాలు చదువుతారు. కష్టమైన చిక్కు ప్రశ్నలకు జవాబులు చెబుతారు. పలు విష యాలలో ఆసక్తి చూపుతూ ఎప్పుడూ ఏవేవో యక్ష ప్రశ్నలు అడుగుతూ ఉంటారు; స్వతం త్రాలోచన శక్తి ప్రదర్శిస్తారు; సూక్ష్మ పరి శీలన, దేనికైనా చురుకుగా ప్రతిస్పందించడం వారిలో కనిపిస్తుంది.

ఉపాధ్యాయుని పరిశీలన కాక, సహజ ప్రతిభ గల పిల్లలను గుర్తించేందుకు ఉప యోగపడే ఇతర విధానాలు: వ్యక్తిగత, లేదా సామూహిక 'తెలివి పరీక్షలు' నిర్వహిం చడం; కార్య సాధన, ప్రత్యేక సామర్థ్య పరీక్షలు జరుపడం.

తరచు సహజ ప్రతిభ గల పిల్లలలో కూడా ఇతర సాధారణ బాల బాలికలలో కనిపించే అంశాలు అనేకం ఉంటాయి అని పరిశీలకులు

(మిగతా 32 వ పేజీలో)

## ఆకాశయానంలో అందెవేసిన 'టెర్న్' అనే నీటి పక్షి



ఆర్కిటిక్ మహా సముద్ర ప్రాంతంలో ఉండే నీటి కాకి జాతికి చెందిన 'టెర్న్' అనే పక్షి ఆకాశయానంలో అందె వేసిన చెయ్యి. ఏటా రెండు సార్లు అది ఒక ధ్రువం (pole) నుంచి మరో ధ్రువానికి ఎగిరి వెళు తుంది. తడవకు 40,000 కి.మీ. ల దూరం అది ప్రయాణిస్తుంది. అంటే ఏడాదిలో 8 నెలలు అది ఎగురుతూనే ఉంటుం దన్నమాట. మధ్య మధ్య నీటి మీదికి వాలుతూ, చేపల్ని ముక్కుతో పట్టుకొని ఆరగిస్తూ, అది తన ప్రయాణం కొనసాగిస్తుంది.

---

"మనిషి దేహం ఒక 'జ్వాల';
అది ప్రసరించే కాంతి అతని 'తెలివి'!" —డి. హెచ్. లారెన్స్

# కార్టూనులు గీయటం ఎలా ?

టి. వెంకటరావు

**35**

## అక్షర రచన




GOTHIC ROMAN

వృత్తి చిత్రకారులూ, సైన్ బోర్డులు తయారు చేసే చిత్రకారులూ అందంగా అక్షర రచనను చేసే కళను విధిగా అభ్యసించాలి. కార్టూనిస్టులకు కూడా 'అక్షర రచనా' కళ తాలూకు ప్రాతిపదిక సూత్రాలు తెలిసి ఉండడం అవసరం. తరచు వారు తమ కార్టూన్‌లకు కొన్నిటికి హెడింగ్‌లు వ్రాయవలసి రావచ్చు. సంభాషణాత్మక కార్టూన్‌లలో ప్రతి చిత్రంలోనూ కొన్ని వాక్యాలు వ్రాయవలసి రావచ్చు!

" 'మంచివాడా? కాదా?' అనేది కాదు నాకు ముఖ్యం;
'బుద్ధిశాలా? మూర్ఖుడా?' అనే నేను చూస్తాను!"—విలియమ్ బేక్

అక్షరాలు అందంగానూ, ఆకర్షకంగానూ ఉండేట్టు వ్రాయాలి. వివిధ 'అక్షర రచనా' శైలులలో దేనినైనా గ్రహించ వచ్చును. కొన్ని శైలులలో అక్షరాలలోని రేఖల మందం ఒకే విధంగా ఉంటుంది. మరి కొన్నిటిలో అక్షరంలోని కొన్ని రేఖలు మందంగానూ, కొన్ని సన్నగానూ ఉంటాయి. ఇంగ్లీష్‌లో కొన్ని ప్రాచీన కథలను పాత కాలం నాటి అక్షర రచనా శైలిలో అచ్చువేస్తున్నారు. కొందరు కలిపివ్రాత శైలిని ఉపయోగిస్తారు. తెలుగులో 'అక్షర రచనా' కళలో శ్రీ 'బాపు' కొత్త కొత్త శైలులను ప్రవేశపెట్టారు. ఈ రోజులలో 'స్క్రిప్ట్' పాళీలను వాడి కలిపి వ్రాతలను అతి వేగంగా వ్రాయవచ్చును. బల్లపరుపు పాళీలు (flat nibs), గుండ్రని పాళీలూ కూడా ఉన్నాయి. అక్షరాలకు అలంకారాలను తీర్చిదిద్దే శైలులు కూడా కొన్ని ఉన్నాయి.

అక్షర రచనలో అక్షరాలన్నీ ఒకే సైజులో ఉండడం ముఖ్యం. అక్షరాల మధ్య అంతరాలు (spacing) సమానంగా ఉండాలి. శీర్షికలోని అక్షరాల రూపంలోనూ, లక్షణంలోనూ ఒక విధమైన సామరస్యం (harmony) ఉండాలి. (సశేషం)

---

(30 వ పేజీ తరువాయి)

మరచిపోకూడదు. సహజ ప్రతిభ గల పిల్లల ఆరోగ్యం సాధారణంగా ఇతర బాల బాలికల ఆరోగ్యం కంటె బాగుంటుంది. పాఠ్య ప్రణాళిక కంటె భిన్నమైన ఇతర వ్యాసంగాలలో (extra-curricular activities) వారు ఎక్కువగా పాల్గొంటూ ఉంటారు. సాహిత్యం, చర్చ, చరిత్ర వంటి వాటిలో వారు ఎక్కువ ఆసక్తి ప్రదర్శిస్తారు. ఉన్నతమైన నైతిక విలువలు కలిగి, బాగా పరిణతి చెందిన వ్యక్తులుగా వారు కనిపిస్తారు.

('హెరాల్డ్ ఆఫ్ హెల్త్' సౌజన్యంతో)

"ప్రజాస్వామ్యం విజయవంతం అయేందుకు
ప్రజాభిప్రాయమూ, పౌరబాధ్యతా ముఖ్యాంగాలు!" —పండిట్ నెహ్రూ

## బహుమతి పొందిన వ్యాసం

# సృష్టిలో సమానత్వం ఉందా?

వి. పి. నర్సింహారెడ్డి, గుంటూరు-2.

అసమానత సృష్టి లక్షణం. మన చేతి వ్రేళ్ళలో ఏ రెండూ సమానంగా లేవు. సమానంగా ఉంటే చేతితో సక్రమంగా మనం పనిచేయలేము. అందరూ పల్లకీ ఎక్కేవారైతే ఇక మోసేవా రెవరు? మానవజాతి ప్రగతికి కారణం సృష్టిలోని అసమానతే! తాజ్‌మహల్ షాజహాన్ స్వయంగా కట్టలేదు. చక్రవర్తితో ఏ విధంగానూ సరితూగని సాధారణ జనం నిర్మించారు. అందరూ రాజులే అయితే ఏలడానికి ప్రజలే ఉండరు.

కర్మ సిద్ధాంతాన్ని అంగీకరిస్తే అసమానత్వం అనివార్యం అని తెలుస్తుంది. అందచందాలలో, ఆరోగ్యంలో, తెలివితేటలలో, సమర్థతలో, నడవడిలో—అన్ని విషయాలలోనూ మనిషి, మనిషికీ ఎంతో వ్యత్యాసం కనిపిస్తుంది. అందరినీ ఒకేవిధంగా చూడలేము. సరిసమానంగా గౌరవించలేము. మనుష్యులలో దేవుడూ కనిపిస్తాడు; దానవులూ కనిపిస్తారు.

జంతువులలో, ఇది 'పులి' (క్రూరమైనది), ఇది 'ఆవు' (సాధుజంతువు) అని తేలికగా

## రూపాయి విలువ ప్రస్తుతం 17.91 పైసలే!



ఇండియా కేంద్ర ప్రభుత్వం తాలూకు 'లేబర్ బ్యూరో' వారు విడుదల చేసిన కార్మికుల 'కన్‌స్యూమర్ ప్రైస్ ఇండెక్స్'ను పరిశీలనగా చూస్తే 1961 లో ఉన్న రూపాయి విలువ ప్రస్తుతం 17.91 పైసలకు పడిపోయినట్లు విశదం అవుతూంది. 1971 మార్చ్‌లో రూపాయి విలువ 54.35 పైసలూ, 1975 మార్చ్‌లో 31.15 పైసలూ, 1980 మార్చ్‌లో 26.81 పైసలూ, 1983 మార్చ్‌లో 19.91 పైసలూ ఉంది.

"తమ కీర్తి ప్రతాపాలు చాటుకునేవారు
ఏ నాటికీ గొప్పవారు కాలేరు."
-పండిట్ నెహ్రూ

తెలుసుకోవచ్చు. కాని మనుష్యులను చూసి ఎవరు క్రూరులో, ఎవరు సాధువులో అంత తేలికగా గుర్తించలేము. కారణాలు ఏవైనా సృష్టిలో సమానత్వం లేని మాట నిజం: సాంఘిక. ఆర్థిక రంగాలలో కూడా సమానత్వం సాధ్యం అయ్యేది కాదు. కమ్యూనిస్ట్ దేశాలలో అయినా అలాంటి సమానత్వం కనిపించదు. ప్రతి మనిషికీ చాలినంత తిండి, గుడ్డ, గూడు సమకూర్చి, అందరికీ ఉచిత విద్యా సౌకర్యం కల్పిస్తే అందరికీ సమానంగా సంక్షేమం చేకూర్చగలుగుతాము. నిజానికి, ఒక్క మరణంలో తప్ప సృష్టిలో ఎందులోనూ సమానత్వం లేదు.

*   *   *

ఎస్. సుధారాణి, గుంటూరు.

సృష్టిలో బాహ్యసమానత్వం లేకపోయినా, ఆంతరంగిక సమానత్వం ఉంది. సూర్యుడు తన వెలుగును అందరికీ సమానంగా ప్రసరించడం, చంద్రుడు తన చల్లని కిరణాలను అన్ని చోట్లా సమానంగా వ్యాపింపజేయడం వంటి సామాన్య విషయాలలోనే కాక కొంత లోతుగా పరిశీలిస్తే సృష్టి మొత్తం మీద సమానత్వం ఉన్నట్లు స్పష్టపడుతుంది. ఉదాహరణకు సృష్టించబడ్డ ప్రతి జీవి జీవించగలుగుతూంది: తన ఆహారాన్ని సంపాదించుకోగలుగుతూంది; పరిసరాల కనుగుణంగా తనను తాను మలచుకో గలుగుతూంది.

సృష్టిలో కొందరు గ్రుడ్డివారూ, మరి కొందరు తమ కళ్ళతో లోకాన్ని చూడగలవారూ ఎందుకు అవుతున్నారు? అని కొందరు ప్రశ్నిస్తూ ఉంటారు. కానీ, పుట్టుకతో అంగవైకల్యాలు ఏర్పడ్డవారు కూడా ఇతరులతో సరిసమానంగా నేర్పు ప్రదర్శించి పని చేయగలుగుతున్నారు.

దురదృష్టవశాత్తు మానవులు సృష్టిలో ఉన్న సమానత్వాన్ని తెలుసుకోకుండా తమలో తామే జాతి, మత, ప్రాంతీయాది భేదాలను సృష్టించుకొని ఒకరితో ఒకరు కలహించుకుంటున్నారు. సృష్టిలోని సమానత్వాన్ని గుర్తించిన నాడే మనిషి సర్వ జీవులలోనూ

## 'ఆస్కార్' అవార్డులు



అమెరికాలోని 'అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్' ఏటేటా చలన చిత్ర రంగంలో సాధించిన ఘన విజయాలకు గుర్తింపుగా బహూకరించే చిన్న ప్రతిమల సముదాయమే 'ఆస్కార్' అవార్డు. 1931 లో ఆ అకాడమీలోని ఒక ఉద్యోగి ఈ అవార్డుకు ఈ పేరు పెట్టాడు.

"'ఎగ్జిక్యూటివ్' చేసే పని: అవసరమైన పనిని గుర్తించడం, దానికి పెట్టుబడిదారును పట్టుకోడం, తగువారిచేత ఆ పని పూర్తి చేయించడం!"

తాను ఉత్తముడు అని నిరోపించుకోగలుగుతాడు.

* * *

పసుమర్తి పద్మనాభన్, నెల్లూరు.

పుట్టుకతో మనుష్య లందరూ ఒక్కటే. భూమిమీదపడ్డ మరుక్షణం నుంచే శిశువు ముఖంమీద కులం, మతం మొదలైనవి లిఖించి, ఆ శిశువు ఏదో ఒక తరగతికో, వర్గానికో చెందినట్టుగా సమాజం నిర్ణయిస్తూంది. మనుష్యుల మధ్య ఈ విధంగా అంతరాలు కల్పించబడుతున్నాయి.

అసమానతలు అనేక రకాలు. సాంఘిక, ఆర్థిక, మత, రాజకీయ రంగాలలో ఇవి ప్రధానంగా కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. భారత దేశంలో — ముఖ్యంగా ఆర్థిక రంగంలో అసమానత్వం ఎక్కువగా కన్పిస్తూంది. ఒక వంక ఆకాశం అంటే మేడలలో అష్టైశ్వర్యాలూ అనుభవించే ధనవంతులూ, మరో వంక నిలువ నీడ లేక ఏ చెట్టునీడనో. లేక ఏ పేవ్‌మెంట్ మీదనో బతుకు వెళ్ళదీసే నిరుపేదలూ కనిపిస్తూ ఉండడం మిక్కిలి శోచనీయమైన విషయం. కొందరు స్త్రీలు వంటపనీ ఇంటిపనీ, చివరికి కన్నబిడ్డల ఆలనా, పాలనా చూడడం కూడా నామోషీగానూ, చిన్నతనంగానూ భావిస్తున్నారు. అది చాలా అనుచితం.

శ్రమలో దైవాన్ని చూడాలి. ప్రజలందరూ అన్నదమ్ములవలె మెలగాలి. జాతి మనుగడకు స్వేచ్ఛా, సమానతలు అత్యంత ఆవశ్యకాలు!

# తంజావూరు బృహదీశ్వరాలయం



దేవాలయాలకు ప్రసిద్ధి చెందిన తంజావూరు 10 మొదలు 14 వ శతాబ్దం దాకా దక్షిణాదిన రాజ్యం చేసిన చోళ రాజుల రాజధాని నగరం. ఆ నగరంలో చోళరాజులు కట్టించిన బృహదీశ్వరాలయం దక్షిణ భారత దేశం అంతటిలో సాటి లేనిది. ప్రధానాలయం మీది 58 మీటర్ల ఎత్తుగల గోపుర శిఖరంపైన ఉన్న ఏకాండ శిలలో నాలుగు వైపులా అందమైన శిల్పాలు మలచబడ్డాయి. ఆ బృహత్ (పెద్ద) శిలను శిఖరం మీదికి చేర్చడానికి 6 కి.మీ.ల పొడవున వాలు రోడ్డును నిర్మించారు! ఈజిప్ట్‌లోని పిరమిడ్‌ల నిర్మాణాలలో పెద్ద పెద్ద శిలలను ఎత్తు ప్రదేశాలకు చేర్చడానికి కూడా ఈ ప్రక్రియనే పాటించారు.

"సంపాదనలో క్లేశాన్నీ, సంరక్షణలో భయాన్నీ, నష్టంలో సంతాపాన్నీ చేకూరుస్తుంది 'ధనం'!" —ఎం. హెన్రీ

# 'పజిల్' ప్రాసాదం

అమెరికా ప్రభుత్వ రక్షణ శాఖా కార్యాలయాలు ఉన్న వాషింగ్టన్‌లోని 'పెంటగన్' సిమెంట్, కాంక్రీట్‌లతో నిర్మించబడిన ఒక పెద్ద భవనం. 40 ఏళ్ళ క్రితం నిర్మితం అయిన



ఈ ప్రాసాదంలో 23,000 మంది సైనిక, పౌర ఉద్యోగులు నిత్యం పనిచేస్తూ ఉంటారు. ప్రపంచంలోని ఏ ఇతర ప్రభుత్వ భవనంలోనూ ఇంతమంది ఉద్యోగులు పనిచేసేది లేదు. నియాన్ లైట్‌లతో నిరంతరం ప్రకాశిస్తూ ఉండే - కిటికీలు లేని వరాండాలు 28 కి.మీ.ల మేర వ్యాపించి ఉన్న-ఈ భవనంలో దారి తప్పిపోయే ప్రమాదం ఎక్కువగా ఉండడంవల్ల దీనిని 'పజిల్' ప్రాసాదం అనడం కూడా కద్దు!

'పెంటగన్'లో రోజూ 2 లక్షల ఫోన్ సందేశాలను స్వీకరించే వీలు ఉంది. వాటిలో చాలా సందేశాలు రహస్యమైనవి. పై అధికారుల టెలిఫోన్ సంభాషణలను మధ్యలో ఎవ్వరూ వినే అవకాశం లేకుండా ఒక ప్రత్యేక సైనికదళం ఆ లైన్‌లను నిరంతరం కాపలా కాస్తూ ఉంటుంది. 'పెంటగన్' భవనంలో పనిచేసేవారి కార్లు 10,000 దాకా నిలిచేందుకు వీలైన కార్ షెడ్‌లు ఉన్నాయి.

'పెంటగన్' భవనంలోని ఉద్యోగులు రోజూ 8 రెస్టారెంట్‌లలోనూ, 9 కెఫిటేరియాలలోనూ మొత్తం 30,000 కప్‌ల కాఫీనీ, 3,000 లిటర్‌ల పాలనూ సేవిస్తూ ఉంటారు.

ప్రస్తుతం 1,50,000 టన్నుల రాసాయనికాయుధాలు (30 లక్షల షెల్‌లూ, మైన్‌లూ, బాంబులతో సహా) 'పెంటగన్' అధీనంలో ఉన్నాయి. అమెరికాలోనూ పసిఫిక్ సముద్రంలోని జాన్‌స్టన్ దీవి (atoll) లోనూ, ప. జర్మనీలోని అమెరికా సైనిక స్థావరాలలోనూ ఈ మారణాయుధాలను నిలువ చేశారు.

## మూడవ డిస్నీ లాండ్

ప్రపంచంలో మూడోదీ, అమెరికా బయట మొట్టమొదటిదీ అయిన 'డిస్నీ లాండ్' జపాన్ రాజధాని నగరం టోకియోలో వెలసింది. 1983 ఏప్రిల్ 15 న ప్రారంభోత్సవం జరిగిన ఈ డిస్నీ లాండ్ నిర్మాణానికి 60 కోట్ల డాలర్లు ఖర్చయింది. మొదటి డిస్నీ లాండ్ కాలిఫోర్నియాలోనూ, రెండోది ఫ్లోరిడాలోని ఓర్లండోలోనూ ఉన్నాయి.

"ఆందోళన లేకపోవడమే నిజమైన ఆనందం:
సంతుష్టిని మించిన సుఖం మరి లేదు!" - సెనెకా

# వళ్ళువర్ కోట్టమ్

తమిళ మహాకవి, నీతి ఉపదేశకుడు తిరు వళ్ళువర్‌కు స్మారక చిహ్నంగా మద్రాసులోని నుంగంబాకమ్‌లో నిర్మించబడిన 'వళ్ళువర్ కోట్టమ్' ఆసియా అంతటిలోకీ మిక్కిలి పెద్ద



నిర్మాణంగా భావించబడుతూంది. రూ. 75 లక్షల వ్యయంతో 6 నెలల గడువులో నిర్మితం అయిన ఈ కట్టడంలో ఒక ప్రధాన ద్వారం, ఒక ప్రేక్షకాగారం, తిరువళ్లువర్ ప్రతిమతో కూడిన ఒక పెద్ద రథం, ఉద్యాన వనం (roof garden), అంతర్జాతీయ కురళ్ పరిశోధక సంస్థ కార్యాలయ భవనం ఉన్నాయి.

ప్రేక్షకాగారం చుట్టూ ఉన్న వరండాలో కురళ్‌లోని 1350 పద్యాలూ చెక్కబడిన నున్నని శిలా ఫలకాలను అమర్చారు.

తిరువళ్ళువర్ విగ్రహంతో కూడిన శిలా నిర్మితమైన రథం ఈ కట్టడం అంతటిలోనూ మిక్కిలి ఎత్తైనది. దాని ఎత్తు — 30.80 మీటర్లు. దాని శిఖరమే 1.50 మీటర్ల ఎత్తుంది. ఉత్తర ఆర్కాట్ జిల్లాలోని వైరకున్ను క్వారీ నుంచి తెచ్చిన నల్లరాతితో ఈ రథం నిర్మించబడింది. తిరుక్కురళ్ గ్రంథంలోని 133 అధ్యాయాలనూ సూచిస్తూ 133 శిల్పాలను రథంలో దిగువ భాగం చుట్టూ చెక్కారు.

తిరుక్కురళ్‌లోని ప్రధాన విభాగాలు మూడు: అరమ్ (ధర్మం), పొరుళ్ (అర్థం) ఇన్బమ్ (కామం). ఈ మూడు విభాగాలనూ సూచిస్తూ రథం నలుపు, ఎరుపు, తెలుపు రంగులతో కూడిన మూడు భాగాలుగా మలచబడింది; ప్రేక్షకాగారం 3 అంతస్తులుగా నిర్మితమైంది; ఆ ప్రేక్షకాగారానికి మూడే ద్వారాలు కల్పించబడ్డాయి.

## 'కాలేయం' మీద తేనె ప్రభావం

'కాలేయం' సరిగా పని చేయక వచ్చే వ్యాధులలో ఔషధంగా తేనెను ఉపయోగిస్తారు. తేనెలోని గ్లూకోజ్ మన ధాతువుల లోని జీవ కణాలకు ఆహారంగా ఉపయోగిస్తుంది. కాలేయంలోని గ్లైకోజన్ నిలువలను పెంచడానికి కూడా అది తోడ్పడుతుంది.

"జీవితంలో పొందే ఆనందం పోరాటాలవల్ల రాదు;
వాటిని పరిహరించడం వల్లే లభిస్తుంది."

# నమ్మలేని నిజాలు

## నామకరణానికి 4,000 పౌన్లు ఖర్చు:

స్పెయిన్‌కి చెందిన నూనెజ్ సీకోజ్ తన కూతురి నామకరణం సందర్భంలో కోర్టుదాకా వెళ్ళవలసి వచ్చింది. ఆయన 'లిబర్టీ' (స్వేచ్ఛ) అని తన కూతురికి పేరు పెట్టుకోవా లనుకున్నాడు కాని మాడ్రిడ్ (స్పెయిన్ రాజధాని) లోని రిజిస్ట్రార్ 'మారియా', 'జువానిటా' వంటి మామూలు పేర్లు తప్ప, ఆ పేరు తను అంగీకరించ నన్నాడు. సీకోజ్ కోర్టుకు వెళ్ళగా తీర్పు అతని పక్షమే అయింది. అయినా 4,000 పౌన్లు ఖర్చయిన తరువాత గాని ఆయన కోరిక నెరవేరలేదు.

* * *

## రెండేళ్ళకు అందిన టెలిగ్రాం:

22 ఏళ్ళ ఇటాలియన్ యువకుడు ఫ్రాన్సెస్కో బాక్సీకి అతని ఉద్యోగం దరఖాస్తు పరిశీలించబడినట్టూ, ఆ ఉద్యోగంలో అతడు నియమించ బడినట్టూ 'కాగ్గియారీ' పట్టణం నుంచి టెలిగ్రాం వచ్చింది. అయితే అతని దురదృష్ట వశాత్తూ పంపించిన 2 ఏళ్ళకు ఆ టెలిగ్రాం అతని కందింది.

* * *

## కన్నబిడ్డను కొట్టి చంపిన తల్లి:

1978 జూలై నెలలో పిస్సినాటి (అమెరికా) లో శ్రీమతి జానా ఆరింగ్టన్ అనే ప్రబుద్ధురాలు ఒక చిన్న జున్ను ముక్క తిని తన ఉపవాస వ్రతం చెరుచుకున్నా డన్న నేరానికి ఒళ్ళు తెలియని కోపంతో స్నేహితురాలు శ్రీమతి మైకేల్ ఆస్టిన్‌తో కలపి తన 5 ఏళ్ళ పసిబిడ్డను చితుకగొట్టి చంపి వేసింది. ఆ మత వర్గంవారికి ఆ ఉపవాస వ్రతం చాలా ముఖ్య మైంది. వాడి తోటి పిల్లలకు బుద్ధి

(మిగతా 40 వ పేజీలో)

## పరిశ్రమలలో హర్యానా ముందంజ



ఇండియాలో ఉత్పత్తి అయే ప్రతి 3 ట్రాక్టర్‌లలోనూ 2 హర్యానాలో తయారవుతున్నాయి. అలాగే దేశంలోని ప్రతి 5 సైకిళ్ళలో ఒకటి హర్యానాలో తయారైనది. ఒక్క అంబాలాయే మన దేశం ఎగుమతి చేసే శాస్త్రీయ పరికరాలలో 35.0 శాతం ఉత్పత్తి చేస్తుంది.

"బావి ఎండిపోతేగాని నీళ్ళ విలువ తెలిసిరాదు!"

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడా లంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు)

1. యం.డి. రాజ్ మహమ్మద్ బి.ఏ., టి.టి.ఐ, ముది మాణిక్యం పోస్టు, వయా తోటపల్లి, హుస్నాబాద్ తాలూకా (కరీంనగర్ జిల్లా), 505 530.

కార్టూన్లు వేయడం, సహృదయతతో స్నేహం చేయడం, పుస్తకాలు చదవడం.

2 వి. విజయసాగర్, 20 సం. లు, బి.కామ్, $S/o$ వి ఎల్. నరసింహమూర్తి, భీమడోలు - 534 425 (ప.గో. జిల్లా).

విజ్ఞాన విషయాలపై ఆసక్తి. రచయితల రచనలు చదవడం, చెస్ ఆడడం.

3. ఎస్. భగవంతు యాదవ్, 18 సం. లు, కొప్పునూరు గ్రామం. కొల్లాపూర్ తాలూకా, మహబూబ్ నగర్ జిల్లా.

విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, పత్రికలు చదవడం, అందరితో స్నేహం.

4 ఏ. రాధ, 25 సం లు, $C/o$ ఎస్.వి. జగదీశ్వరరావు, గాండ్ల వీధి, బద్వేలు, కడప జిల్లా.

స్టాంపుల సేకరణ, నిత్య సత్యాలు వ్రాయడం, ప్రజలమీద అభిమానం

5. వై. రమేష్‌కుమార్ రెడ్డి, 25 సం. లు, నార్త్ మోపూరు పోస్టు, కొవ్వూరు తాలూకా (నెల్లూరు జిల్లా), 524 315.

గుర్రపు స్వారీ, కరాటే ప్రాక్టీస్ చేయడం, ఫొటోగ్రఫీ.

6. వై. యు. మల్లేశ్వర రెడ్డి, 22 సం.లు. ఏ.ఎమ్ ఐ.ఇ., గుంటూరువారి తోట, 8 వ లైను, గుంటూరు - 522 200.

పుస్తక పఠనం, కరాటే ప్రాక్టీస్ చేయడం, సినిమాలు చూడడం.

## ఇండియాలో తొలి జాతీయారణ్యం



ఇండియాలో మొట్ట మొదటి రణ్యాన్ని మధ్య ప్రదేశ్‌లోని భోపాల్‌లో పెంచుతున్నారు. 2 ఏళ్ళ క్రితం చేపట్టిన ఈ ప్రణాళికను 445 హెక్టేర్ల ప్రాంతంలో రూ. 30 కోట్ల వ్యయంతో అమలు జరుపుతారు. ఈ అడవికి ప్రధాన లక్ష్యం - వన్య మృగాలు తమ సహజ పరిసరాలలో జీవించే అవకాశం కల్పించడం!

---

"మంచి సంకల్పాలు మంచి ప్రవర్తనకు బీజాలు!" —విలియమ్ టెంపిల్

7. ఎన్ సుదర్శన్, 16 సం. లు, S/o ఎన్. శామ్యూల్, ఇం. నెం. 5-43, అంబరు పేట పోస్టు, దోమకొండ తాలూకా (నిజామాబాద్ జిల్లా) 503 126.

పుస్తక పఠనం, రేడియో వినడం, ఉత్తరాలు వ్రాయడం.

8. వి నాగభూషణమ్, 21 సం లు, బి.ఎస్ సి. C/o శివరామ్ జిరాక్స్ సెంటర్, నర్సాపూర్ పోస్టు (మెదక్ జిల్లా) 502 313.

విస్డమ్ చదవడం, రేడియో ప్రసారాలు వినడం, అందరితో స్నేహం.

9. రేజేటి పెదపాప, 21 సం. లు, D/o గోపాలాచార్యులుగారు, గొల్లల మామిడాడ - 533 344.

డ్రాయింగ్ వేయడం, పరోపకారం.

10. చామర్తి శాంతిశ్రీ, 15 సం.లు, C/o రేజేటి గోపాలాచార్యులు గారు, గొల్లల మామిడాడ - 533 344.

చదవడం, పరోపకారం.

11. రేజేటి పద్మావతి, 17 సం. లు, D/o గోపాలాచార్యులుగారు, గొల్లల మామిడాడ - 533 344.

ప్రకృతి పరిశీలన, స్నేహం చేయడం

12. పి. రామాంజనేయులు, 22 సం. లు, ఇం. నెం. 1/58, ఎర్రకుంట్ల పోస్టు, అనంతపురం జిల్లా, 515 731.

రేడియో వినడం, సినిమాలు చూడడం, పత్రికలు చదవడం.

(38 వ పేజీ తరువాయి)

రావడం కోసం తాము ఆ పని చేసినట్టు పైగా వాళ్లు వాదించారు.

* * *

## ద. ఆఫ్రికాలో డాక్టర్ల కొరత:

ద. ఆఫ్రికాలో అక్కడి నీగ్రోలను చేర్చుకునే వైద్య కళాశాల ఒక్కటే ఉంది. అది స్థాపించిన తరువాత గడచిన 5 ఏళ్ళలోనూ 37 గురు వైద్యనిపుణులు మాత్రమే అక్కడ తయా రయారు. వారికైనా తెల్లడాక్టర్లకిచ్చినంత సునిశిత శిక్షణ ఈయబడలేదు. ప్రభుత్వపు లెక్కల ప్రకారం చూపినా, అక్కడ ప్రతి 91,000 మందికీ ఒకే ఒక డాక్టర్ ఉన్నాడు.

## ఎటు పోయి ఎటొచ్చినా....!






"ఇదిగో-బజారు వెళ్ళి రేషన్ తెస్తాను. ఎందుకైనా మంచిది గుర్తుంచుకో: ఇన్స్యూరెన్స్ పోలసీ నేల బోషాణంలో ఉంది!"

"రోమ్ నగరం ఒక్క రోజులో నిర్మించబడలేదు!"

# 'ప్లానెటేరియమ్' అంటే...

సూర్యుడూ, చంద్రుడూ, గ్రహాలూ, నక్షత్రాలూ ఆకాశంలో ఎలా తిరుగుతున్నదీ వాటి నమోనాలను కృత్రిమంగా ఒక డోమ్‌లో అమర్చి ప్రదర్శించే 'గ్రహ మందిరాన్ని'



ప్లానెటేరియమ్ అంటారు. ఒక స్విచ్ బోర్డ్ వద్ద నుంచుని ఉపన్యాసకుడు వేర్వేరు లైట్లు వేస్తూ, ఆర్పుతూ వేరు వేరు ఖగోళాలనూ, గ్రహాలనూ, వాటి కక్ష్యలనూ ప్రదర్శిస్తాడు. ఒక పెద్ద ఫ్రేమ్‌లో ఒక సిలిండర్ ఆకారంలో ఉండే ఒక పరికరం ఎటు కావాలంటే అటు తిప్పడానికి వీలుగా అమర్చబడి ఉంటుంది. స్విచ్ బోర్డు సాయంతో ఆ ప్రొజెక్టర్‌ను త్రిప్పుతూ ఉపన్యాసకుడు ఎక్కువ కాంతి గల ఖగోళాలు ఏవో, తక్కువ కాంతి గలవి ఏవో, సంవత్సరంలో వేర్వేరు భాగాలలో ఏ గోళాలు ఎక్కువ ఉంటాయో, ఋతువుల మార్పులు ఎలా సంభవిస్తాయో ప్రత్యక్షంగా ప్రదర్శిస్తూ ఉపన్యసిస్తాడు.

ప్లానెటేరియమ్ నిర్మించడానికి పూర్వం 'ఆరెరీ' (గడియారంలాంటి పరికరంలో గ్రహాలను ప్రదర్శించే సాధనం) ఉండేది. దానిలో సౌర కుటుంబంలోని గ్రహాలూ, ఇతర ఖగోళాలూ ఎలా చలించేదీ, వాటి పరస్పర సంబంధాలూ స్థూలంగా ప్రదర్శించబడేవి. ఒక హాండిల్ తిప్పితే అనేక చక్రాలు

---

## ఇండియాలో తొలి భూగర్భ ప్రయోగశాల

కర్ణాటక రాష్ట్రంలోని కోలార్ గోల్డ్ ఫీల్డ్స్‌లో 'భారత్ గోల్డ్ మైన్స్'వారి 2కి.మీ.ల లోతు గల గిఫర్డ్ సురంగం లోపలి ఒక గుహలో ఇండియాలోని మొట్టమొదటి భూగర్భ ప్రయోగశాల (laboratory) నెలకొల్పబడింది ఈ లేబొరేటరీలో 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చ్', సంస్థ 'ప్రోటాన్' క్షీణత (decay) ను గుర్తించేందుకు ప్రస్తుతం వాడుకలో ఉన్న 140 టన్నుల 'డిటెక్టర్' (పరిశోధక యంత్రం) కంటె 3 రెట్లు పెద్ద డిటెక్టర్‌ను స్థాపిస్తారు.

"నాయకుడికి విషయం తెలియాలి, తనకు తెలుసు నని తెలియాలి, ఆ సంగతి నలుగురికీ విశదం చెయ్యాలి."

—క్లారెన్స్ బి. రాండాల్

తిరుగుతూ ఆ పరికరాన్ని కావలసిన విధంగా ఆపరేట్ చేయడానికి వీలయేది. ఈ 'ఆరెరీ'ని కనిపెట్టిన జార్జ్ గ్రాహమ్ 4వ 'ఆరెరీ' ప్రభువు (1676-1731) గౌరవార్థం ఆయన పేరు ఈ పరికరానికి పెట్టాడు.



బొంబాయి ప్లానెటేరియమ్

హోల్‌స్టైన్‌లోని డ్యూక్ 3వ ఫ్రెడరిక్ ఆస్థానంలో గణిత శాస్త్రవేత్త అయిన ఒలీరియస్ ఆదేశాల కనుగుణంగా 1654-1664 మధ్య కాలంలో డెన్మార్క్‌లో ఆండ్రియా బుష్ నిర్మించిన-గుండ్రంగా త్రిప్పడానికి వీలైన - ఒక పెద్ద గోళం ప్రస్తుతం సోవియెట్ యూనియన్‌లోని లెనిన్‌గ్రాడ్‌లో భద్రపరచబడి ఉంది. దాని లోపలి భాగంలో నక్షత్రాలు చిత్రించబడ్డాయి. 10.54 మీటర్ల పరిధి గల ఆ గోళం బరువు 3½ టన్నులు.

మొట్టమొదటి ప్లానెటేరియమ్‌ను జర్మనీలోని మ్యూనిఖ్ నగరంలోని డాయిష్టె మ్యూజియమ్‌లో 1923 లో 'జైస్ ఆఫ్ జేనా' నిర్మించాడు.

ప్రపంచంలో మిక్కిలి పెద్ద ప్లానెటేరియమ్ మాస్కో నగరం (రష్యా)లో ఉంది. దాని వ్యాసం 25.15 మీటర్లు.

బ్రిటన్‌లో తొలి ప్లానెటేరియమ్‌ను 1958 లో లండన్ నగరంలో ఆవిష్కరించారు. 21.33 మీటర్ల ఎత్తు గల డోమ్ మీద 8,900 నక్షత్రాలను ప్రొజెక్ట్ చేసే అవకాశం అక్కడ ఉంది.

కలకత్తాలో చౌరంగీ రోడ్డూ, థియేటర్ రోడ్డూ కలిసే జంక్షన్‌లో ఉన్న ప్లానెటేరియమ్ అత్యాధునికమైనది. బొంబాయి, అహమ్మదాబాద్, విజయవాడ వంటి పలు ఇతర నగరాలలో ప్లానెటేరియమ్‌లు వెలిశాయి. ●

## ఇండియాలో బరువులు లాగే జంతువులు

ఇండియాలో బరువులు లాగేందుకు వాడే 8 కోట్ల జంతువులలోనూ 7 కోట్లు ఎడ్లే! పల్లె సీమలలో వ్యవసాయానికీ, సరకుల రవాణాకూ ఉపయోగించే శక్తిలో 50 శాతం ఎడ్ల నుంచే వస్తోంది.

## 'గురు' గ్రహం వద్దకు తొలి కృత్రిమ ఉపగ్రహం

'గురు' గ్రహం వద్దకు 1986 చివరలో తొలి సారిగా కృత్రిమ ఉపగ్రహాన్ని పంపేందుకు అవసరమైన సన్నాహాలు చురుకుగా సాగుతున్నాయి. 'గెలీలియో' అనే పేరు గల ఈ కృత్రిమ ఉపగ్రహాన్ని 'నేషనల్ ఏరోనాటికల్ స్పేస్ అడ్మినిస్ట్రేషన్' (NASA)కు చెందిన 'ఛాలెంజర్' అంతరిక్షంలోకి ప్రవేశ పెడుతుంది.

"'స్వేచ్ఛ' తప్పులు చేయవచ్చు; కాని
'నిరంకుశత్వం' జాతికే ముప్పు తెస్తుంది!" —మాట్ షార్న్

(20 వ పేజీ తరువాయి)
దారం కన్న కూడా సన్నగా, నాజూకుగా వెండి, బంగారు తీగెలను తీయగల మని సగర్వంగా చెప్పుకునేవారు. ఇక్కడి 'సోనేరీ మసీదు' పై భాగాన నిలబడే పర్షియావాడైన నాదిర్‌షా 1739 మార్చి 22 న ఢిల్లీ పౌరులను ఊచకోత కోయడం తిలకించాడు.



మొగల్ ఉద్యానవనం (రాష్ట్రపతి భవనం)

ఢిల్లీలోని అపురూపమైన మొగల్ కట్టడాలలో ఒకటి అయిన ఎర్రకోట (Red Fort) చుట్టూనే షాజహాన్ కాలం నాటి ఢిల్లీ ఏడో ఢిల్లీ నగరం వ్యాపించి ఉండేది. శతాబ్దాలు గడిచినా ఆ భవనం నేటికీ చెక్కు చెదరకుండా నిలిచి ఉంది. చాలా పల్లపు ప్రాంతంలో నిర్మింపబడిన ఈ కోట యమునా నది అవలివైపు నుంచి వచ్చేవారికి తప్ప మరి ఏవైపు నుంచి వచ్చే శత్రువులకూ కనిపించదు. ఎర్ర కోటలోని 'దివాన్-ఇ-ఖాస్' (కొలువు కూటం) నుంచి పర్షియాకు చెందిన నాదిర్ షా కోటి రూపాయల పైచిలుకు ఖరీదు చేసే జగత్ ప్రసిద్ధమైన 'నెమలి సింహాసనాన్ని' తన దేశానికి తరలించుకు పోయాడు. ఆ సింహాసనంలోని నెమలి నోటిలో 83 కేరట్‌ల వజ్రం ఒకటీ, ప్రస్తుతం బ్రిటిష్ రాణి కిరీటాన్ని అలంకరించిన కోహినూర్ వజ్రం ఒకటీ పొదగబడి ఉండేవి. ఎర్రకోటలోని మరో చెప్పుకో దగిన మందిరం 'రంగ్ మహల్!' అందంగా అలంకరించబడిన ఈ మందిరం రాణివాసంగా ఉండేది. ఆరంభంలో ఈ మందిరం కప్పు వెండి తోనూ, బంగారంతోనూ నిర్మించబడింది. అయితే-దురదృష్టవంతుడైన ఫరూక్‌షియార్ హయాంలో ఏదో అవసరానికి ఆ వెండి బంగారాలను అమ్ముకుని, వాటి స్థానే రాగి కప్పు అమర్చారు. 2 వ అక్బర్ హయాంలో

## బాల నేరస్థుల మీద జైళ్ల దారుణ ప్రభావం

తొమ్మిది మంది ప. జర్మన్ సాంఘిక శాస్త్రవేత్తలూ, నేరశాస్త్ర (criminology) వేత్తలూ జైళ్ళలో శిక్షలు అనుభవిస్తున్న 200 మంది బాల నేరస్థులను పరిశీలించి, పిల్లలను జైళ్ళలో పెట్టడం వల్ల వారి వర్తన చక్కబడ దనీ, వారి జీవితాల మీద జైలు జీవితం ప్రభావం దారుణంగా ఉందనీ ప్రకటించారు. వాళ్ళను పట్టుకొని జైల్లో పెట్టడం కంటె స్వేచ్ఛగా వదిలితేనే వారు బాగుపడే అవకాశాలు ఎక్కువ అని వారి మతం!

"రాజకీయ నాయకుడి చూపు వచ్చే ఎన్నికల మీద:
రాజనీతి వేత్త దృష్టి ముందు తరం ప్రజల మీద!" —జేమ్స్ ఫ్రీమన్ క్లార్క్

ఆ రాగిని కూడా తొలగించి కొయ్య కప్పు ఏర్పరిచారు. మొగలాయీ సామ్రాజ్యానికి



సర్ ఎడ్విన్ లుట్యెన్స్

క్షీణ దశ ఆరంభం కావడంతో క్రమంగా ఎర్ర కోటలో చీకట్లు ముసురుకోసాగాయి.

ప్రపంచంలోనే మిక్కిలి అందమైన మసీదులలో ఒకటి అయిన 'జుమ్మా మసీదు' షాజహాన్ నిర్మించిందే! ఎర్రకోటకు ఎదురుగా ఎర్ర రాళ్ళతోనూ, పాలరాతితోనూ అది దర్శనీయంగా కనిపిస్తుంది. ఆ మసీదులో మహమ్మద్ ప్రవక్త పాదరక్ష, ఆయన తల వెంట్రుక, రాతిమీద ముద్రించబడిన ఆయన పాద చిహ్నాలూ, ఒకప్పుడు ఆయన సమాధి మీద ఆచ్ఛాదనగా ఉండిన ఆకు పచ్చని చాందినీ (canopy) వంటి ముస్లిములకు అతి పవిత్రములైన వస్తువులు భద్రపరచబడి ఉన్నాయి.

'కాశ్మీరీ గేట్' నగర ప్రాకారంలోని ఉత్తరపు గేట్. ఈ గేట్‌కు వెలుపలనే వెనుకటి సెక్రటేరియట్ భవనం ఉంది. బ్రిటిష్ సైన్యం తాలూకు సేనాని నికోల్సన్ సిపాయీల తిరుగుబాటు (ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం) సందర్భంలో



రాష్ట్రపతి భవనం

"సజ్జనులతో మైత్రి చిరకాలం నిలిచి ఉంటుంది!" —జెరిమీ టైలర్

1857 సెప్టెంబరు నెలలో ఈ గేట్ ద్వారానే ఢిల్లీలో ప్రవేశించి ఆక్రమించుకున్నాడు. ఇప్పటికీ ఈ గేట్ గోడల మీద ఆ నాటి తుపాకీ గుళ్ళ గుర్తులు కనిపిస్తాయి.



రాష్ట్రపతి - జ్ఞానీ జైల్‌సింగ్

సుల్తాన్ ఘరీ (గుహా నివాసి) సమాధే ఢిల్లీలో కనిపించే సమాధు లన్నిటిలో మిక్కిలి ప్రాచీన మైంది. తన అందాల రాణి స్వయంగా చేతులారా తనకు ఉపచర్యలు చేయడానికి నిరాకరించడంతో విరక్తి చెంది ఐహిక భోగ భాగ్యాల క్షణభంగురత్వాన్ని చాటేందుకు సుల్తాన్ ఘరీ ప్రత్యేకంగా నిర్మించుకున్న ఒక గుహలోకి తన బస మార్చాడట!

ఒక పథకం ప్రకారం విశాలమైన వీథుల తోనూ, అందమైన పచ్చనిగడ్డిబీడు (lawns) లతోనూ, ఫౌంటెన్‌లతోనూ అతి మనోహరంగా నిర్మించబడిన కొత్త ఢిల్లీని డిజైన్ చేసి నిర్మించిన ఘనత సర్ ఎడ్విన్ లుట్యెన్స్, సర్ హెర్బర్ట్ బేకర్‌లది.



పార్లమెంట్ భవనం

1931లో పూర్తి అయిన ఈ నగర నిర్మాణంలో యూరోపియన్, భారతీయ వాస్తు శిల్పాల మనోహర సమ్మేళనం కనిపిస్తుంది. భారత రాష్ట్రపతి నివసించే రాష్ట్రపతి భవన్ (పూర్వం బ్రిటిష్ రాజ ప్రతినిధి ఇక్కడ

---

## అంటార్కిటిక్ సముద్రం అడుగున మహా పర్వతం

ఎప్పుడూ మంచుతో కప్పబడి ఉండే 'అంటార్కిటికా' ('దక్షిణధ్రువం') ఖండ పరిశోధనకు వెళ్ళిన మొదటి ఇండియన్ పరిశోధకుల బృందం అంటార్కిటిక్ సముద్రం అడుగున ఉన్న ఒక మహాపర్వతాన్ని గుర్తించింది. ప్రపంచంలోని ఇతర సముద్రాల అడుగున ఉన్న పర్వతాలకంటె ఇది ఎత్తైంది. అట్టడుగున ఈ పర్వతం వెడల్పు 185 కి.మీ.లు; శిఖరం వద్ద దీని వెడల్పు 134 కి.మీ. లు.

---

"సలహా పిండిమంచు లాంటిది; ఎంత మృదువుగా ఉంటే అంత ఎక్కువ కాలం నిలిచి ఉంటుంది!" —కోలెరిడ్జ్

ఉండేవారు) అద్భుతమైన మొగల్ ఉద్యాన వనాల మధ్య నిర్మించబడిన మిక్కిలి అందమైన భవనాలలో ఒకటి. పార్లమెంట్ భవనం మూడు అంతస్తులలో వృత్తాకారంగా



తీన్‌మూర్తి భవనం

నిర్మించబడింది. 90 మీటర్ల వ్యాసం గల ఒక డోమ్‌తో కూడిన వృత్తాకారంగా ఉండే



సుప్రీమ్ కోర్టు భవనం

ఈ భవనం అతి వినూతన పక్కీలో నిర్మించబడిన చక్కని కట్టడం!

అనేక దుకాణాలూ, హోటళ్ళూ, రెస్టారెంట్లూ, పత్రికా కార్యాలయాలూ మొదలైన వాటికి ఉపయోగించే ఒకే నమోనాలో ఉండే భవంతులతో వర్తులాకారంగా చిన పేట 'కన్నాట్ ప్లేస్!'



పెద్దసైజు ఆటోరిక్షా (ఫట్‌ఫటా)

అందమైన ఉద్యానవనాల మధ్య అందరి దృష్టినీ ఆకర్షించే తీన్‌మూర్తి భవనంలో ప్రథమ భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఉండేవారు. సుప్రీమ్ కోర్టు భవనం కూడా దేశంలోని అత్యున్నత న్యాయస్థానం ఉండడానికి తగినట్లుగా మిక్కిలి ఠీవిగానూ, హుందాగానూ నిర్మించబడింది.

1938 లో రాజా బలదేవ్‌దాస్ బిర్లా కోటి రూపాయలు వెచ్చించి పాలరాతితో నిర్మించిన బిర్లామందిర్ ఇండియాలోని అన్ని

(మిగతా 47 వ పేజీలో)

"జీవితంలో ధ్యేయాలు రెండు: ఒకటి - కోరుకున్నది సాధించడం; రెండు - సాధించింది అనుభవించడం!" —లోగన్ పియర్సాల్ స్మిత్

# బంగారు పునాది గల "పురందర్" గేటు

పూనె (మహారాష్ట్ర) సమీపంలోని పురందర్ కోట ముఖ ద్వారానికి పునాది పూర్తిగా బంగారంతో నిర్మించారట! క్రీ.శ. 1290 లో ప్రస్తుతం కర్ణాటక రాష్ట్రంలో ఉన్న బీదర్ రాజా అక్కడ కోట నిర్మించ మని తన ఇంజనీర్లకు పురమాయించారు. వారు కోట ముఖ ద్వారం నిర్మించవలసి ఉన్న ప్రదేశం చాలా తేలిక నేల అనీ, అక్కడ కట్టిన ఏ కట్టడం అయినా నేలలోకి క్రుంగి పోవడం ఖాయం అనీ మనవి చేసుకున్నారు.

అప్పుడు రాజా గారికి ఒక కల వచ్చింది కలలో ఎవరో కనిపించి ఆయనను ఆదేశించారు. ఆ ఆదేశానుసారం ఆ ముఖ ద్వారాన్ని పూర్తిగా బంగారపు పునాది మీద నిర్మించడానికి ఆయన తీర్మానించుకున్నారు.

ఇంజనీర్లు పన్నెండేసి అడుగుల లోతు గల రెండు పెద్ద గోతులు తవ్వించారు 50,000 14 కేరట్ వన్నె గల బంగారపు ఇటుకలతో ఆ గోతులను వారు నింపారు. ఆ ఇటుకల మొత్తం బరువు 27,000 పౌన్లు. ఇప్పటి ధరను బట్టి చూస్తే ఆ బంగారం విలువ దాదాపు రూ 86 కోట్లు ఉంటుంది.

ఆ పురందర్ గేటు - అది నిర్మించి దాదాపు 700 సంవత్సరాలు కావస్తున్నా - ఇప్పటికీ రవ్వంతయినా చెక్కు చెదరకుండా నిలిచి ఉంది

## విద్యా ప్రమాణాల క్షీణత

ఇండియాలో అన్ని రకాల విద్యా రంగాల లోనూ ప్రమాణాలు పడిపోతున్నాయి. ఇందుకు చాలా వరకు కారణం: రాజకీయాల జోక్యం, నిధుల కొరత అని చెప్పవచ్చు

—హిదయతుల్లా,
(మాజీ భారత ఉపరాష్ట్రపతి)

(46 వ పేజీ తరువాయి)

మతాల ఆలయాలకూ నెలవైన ఒక సువిశాలమైన మందిరం వేసవిలో దారుణమైన ఎండా, శీతాకాలంలో విపరీతమైన చలీ ఉన్నా, మొత్తం మీద ఢిల్లీ వాతావరణం ఆహ్లాద జనకంగానే ఉంటుంది.



ఢిల్లీలో షాపింగ్ సరదాగా ఉండడమే కాదు; విజ్ఞాన దాయకం కూడాను. మొగల్ చక్రవర్తుల పోషణలో దంతపు చెక్కడం కళకు ఢిల్లీ వాసి కెక్కింది. నేటికీ అక్కడ తయారైన దంతపు నగిషీ వస్తువులకు ప్రపంచం అంతటా తగని గిరాకీ ఉంది! ●

"దుస్సాంగత్యం కన్న ఒంటరితనం మేలు!" —మహమ్మద్ ప్రవక్త

# ప్రపంచ వార్తలు

## ఆహార పదార్థాలు చెడిపోని కొత్త ప్లాస్టిక్ పాత్ర :

ప్రాణ వాయువు తగిలితే పాడయ్యే 'టొమేటో కెచెప్', ఊరగాయలు వంటి అహార పదార్థాలు చెడిపోకుండా భద్ర పరచే 'గామా' అనే ఒక కొత్త రకం ప్లాస్టిక్ పాత్రను అమెరికాలోని ఒక సంస్థ తయారు చేసింది.

* *

## పెద్ద మొత్తంలో మత్తు మందుల సా( ।నం

అమెరికా సముద్రతీరం బందోబస్తు నౌకాధి కారులు కెనడాలో రిజిష్టర్ అయిన ఒక నౌకను వెన్నాడి క్యూబా, హైటీల మధ్య దానిని అటకాయించగా ఇంతకు ముందు ఎప్పుడూ దొరకనంత పెద్ద మొత్తంలో మత్తు మందులు (drugs) దానిలో దొరికాయి. సుమారు 20 కోట్ల డాలర్లు ఖరీదు చేసే 'కొకెయిన్'ను వారు పట్టుకున్నారు.

* * *

## లక్షాధికారైన లవణ మన్నుమె పాపం!

మెసాచుసెట్స్ (అమెరికా) రాష్ట్రంలోని న్యూ బెడ్‌ఫోర్డ్‌లో జన్మించిన హెట్టీ గ్రీన్ తన తండ్రినుంచి సంక్రమించిన ఆ సిరి జాగ్రత్తగా పెంచి, మొత్తం 10 కోట్ల డాలర్ల విలువ చేసే ఆస్తిని సంపాదించింది. ఎంత ఆస్తి ఉన్నా కరెంట్ ఖర్చు అవుతుం దని ఆమె లైట్ వేసుకునేది కాదు. వేడి చేస్తే వృథా ఖర్చని చల్లని గ్రుడ్లూ, ఉలి పాయలే తినేది. 1916 లో ఆమె చనిపోయే నాటికి ఆమె ఆసి విలువ 12.5 కోట్ల డాలర్లు.

* * *

## ఈ శతాబ్ది కంతకూ పెద్ద దావాగ్ని :

బోర్నియోలోని ఇండోనేషియాకు చెందిన తూర్పు 'కాలిమంటాన్' అడవులలో బ్రహ్మాండమైన దావాగ్ని విజృంభించి. 1983 ఫిబ్రవరి నెల నుంచి జూన్ నెల దాకా మండు తూనే ఉంది. ఈ నాటి 'లెబనాన్' సైజుకు మూడింతల భూమిలో సమస్తం ఆ అగ్నికి ఆహుతి అయిపోయింది కనీసం 35 లక్షల హెక్టేర్‌లలో (సుమారు 13,500 చ. మైళ్ళలో) ఉన్న అడవులను అది పొట్టను బెట్టుకుంది. ఈ శతాబ్దిలో వాతావరణ కాలుష్యాన్ని కలి గించిన మిక్కిలి దారుణమైన సంఘటన అని దీనిని వర్ణిస్తున్నారు.

---

"పేదల కన్నీటి వరదలో రాజుల సింహాసనాలు కొట్టుకుపోతాయి!" — అనీబిసెంట్

# అసూయ చేసే చెరుపు

మనకు తెలియకుండానే ఇతరులతో మనల్ని పోల్చి చూసుకోడం వల్ల మనలో 'అసూయ' అంకురిస్తుంది. ఇతరులు సాధించిన లక్ష్యాలను అందుకోలేని మన అశక్తతే మనల్ని అసూయాపరులను చేస్తుంది. ఇతరుల విజయాలపట్ల మనం ప్రదర్శించే ప్రతికూల భావం 'అసూయ'. మన పరిమిత శక్తికీ, మన ఓటమికీ స్పష్టమైన నిదర్శనం అది! అసూయాపరులు ఎప్పుడూ చిర్రుబుర్రులాడుతూ ఉంటారు; అందరినీ అనుమానిస్తారు! తన అసూయకు గురి అయిన వ్యక్తి మీద పగ, కసి పెంచుకుంటారు. అతి కఠినంగా, నిర్దాక్షిణ్యంగా అతనిని / ఆమెను విమర్శిస్తారు; ఖండిస్తారు – అవతలి వ్యక్తి ఇలాంటి ప్రవర్తనకు ఏమాత్రం అవకాశం ఇవ్వకపోయినా సరే!

నిజానికి 'అసూయ' ఇతరులు మనలో కలిగించేది కానే కాదు. అసూయకు గురి అయిన వ్యక్తి మన 'అసూయ'కు అయితే పరోక్షంగా మాత్రమే కారణం కావచ్చు. కాని, ఆ సంగతి వారికి తెలిసి ఉండకపోవడం కూడా సంభవమే! అసూయాపరుడు నిరంతరం అకారణంగా ఆ వ్యక్తి మీద కక్ష వహిస్తాడు! మాటిమాటికీ అనవసరంగా ఆ వ్యక్తిని అగౌరవ పరచాలని యత్నిస్తూ ఉండడం ఆ వ్యక్తికి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

'అసూయ' మనిషిలోని మంచి లక్షణాలన్నిటినీ తుడిచిపెట్టేస్తుంది. ఇతరులతో మెలగడంలో 'నిజాయితీ' అంటే ఏమిటో మరచిపోయేట్టు చేస్తుంది. అసూయాపరుడు తన కేదో కీడు మూడబోతున్న దని భయపడుతూ, ఎంతకైనా తెగిస్తాడు. ఈ విపరీత ప్రవృత్తి నిత్యజీవితంలో అందరిలాగా ప్రవర్తించగల శక్తిని హరిస్తుంది.

## భారత రైల్వేలో పని వారు



ఆసియా అంతటిలో మిక్కిలి పెద్దదీ, ప్రపంచంలో నాలుగోదీ అయిన భారత రైల్వే వ్యవస్థలో 1,80,000 మంది పని చేస్తున్నారు. భారత రైల్వే వ్యవస్థకు గల ఆస్తుల మొత్తం విలువ: రూ. 620 కోట్లు.

''అధికారం' లోని కష్టం అధికారంలో ఉన్నవారి నడుగు; 'అధికారం' లో ఉండే సుఖం దానికోసం అర్రులు సాచే వారి నడుగు!" – ఛార్లెస్ కాలెబ్ కోల్టన్

'అసూయ' నుంచి ముక్తి సాధించడం ఎలా? :

నీలో నువే తర్కించుకో: నీ అసూయా భావాలు ఎంత నిరర్థకాలో, నీ జీవితానికి అవి ఎంత హానికరాలో గుర్తించేందుకు ప్రయత్నించు. నీ 'అసూయ'కు కారణాలను అన్వేషిస్తే, దానికి వాస్తవమైన పునాదులు లేవని నీకు అర్థం అవుతుంది. 'అసూయ' నీలోనూ, నీ 'అసూయ'కు గురి అయిన వారి జీవితాలలోనూ ఎంత చిరాకునూ, వేదననూ కలిగిస్తుందో గుర్తించు! నిజానికి 'అసూయ' వంటి ప్రతికూల భావాలు మన మనస్సులో పరిణతి ఏర్పడలేదనడానికి నిదర్శనాలు. వాటి పర్యవసానం: నిరాశ, ఆశాభంగం!

'అసూయ'కు అర్థం — నీలో లేకుండా అవతలి వ్యక్తిలో ఉన్న లక్షణం నీకు చాలా ఇష్టమైంది అని అందుచేత నిజాయితీగా ఆ లక్షణాన్ని మెచ్చుకొని, అతడు ఆ లక్షణాన్ని ఇంకా పెంపొందించుకునేందుకు సాయం చెయ్యాలి. అప్పుడు - మంచి లక్షణాలు ఎవరిలో ఉన్నా మెచ్చుకునే స్వభావం నీలో ఏర్పడుతుంది. నువు అసూయపడే వ్యక్తి మార్గంలో ఆటంకాలు కల్పించడం మాని, అతడు తన మార్గంలో స్వేచ్ఛగా అభివృద్ధి పొందేట్టు ప్రోత్సహించు! ఇతరుల సుఖం, విజయం చూసి సంతోషపడడం అలవరచుకుంటే నీలో ఎన్నో మంచి లక్షణాలు వాటంతట అవే పొడసూపుతాయి.

అవతలి వ్యక్తుల ఆధిక్యాన్ని అంగీకరించడం, వారితో పోటీ పడడంలో నీ పరిమితశక్తిని నీవు గుర్తించడం నీకెంతో మేలు చేస్తుంది. ఆ అవతలి వ్యక్తుల లక్షణాలను నీ జీవితంలో నీవు అలవరచుకోడానికి హృదయపూర్వకమైన ప్రయత్నం చెయ్యి! 'అసూయ' అనే వ్యాధికి విరుగుడుగా పనిచేసే ఒక అనుకూలమైన భావం ఇది. ఆధ్యాత్మిక ప్రగతికోసం తీవ్రమైన ఆరాటం నీలో కలిగితే 'అసూయ'లాంటి ప్రతికూల భావాలన్నీ మటుమాయం అయిపోతాయి. ఆత్మ సాక్షాత్కారం కోసం సాధన చేస్తే, నీ మనస్సు ప్రశాంతం అవుతుంది. నీలోని ప్రతికూల భావాలు - 'కక్ష'లూ, 'పగ'లూ - అన్నిటినీ నీవు మరచి పోతావు. ●

---

## రెండు స్వరాల టెలిఫోన్



టెలిఫోన్ మొదట కనిపెట్టినప్పుడు ఉన్న ధోరణిలోనే ఒకే స్వరాన్ని ఉత్పాదించే టెలిఫోన్‌లతోనే ఇటీవలి వరకూ కాలక్షేపం చేశాము. కాని ఇటీవల ఒత్తిడితో విద్యుత్తునుత్పాదించే ధ్వన్యుత్పాదక యంత్రం రెండు స్వరాలను (tones) ఉత్పాదించ గలుగుతుంది. దీనివల్ల గదిలో ఉన్న అనేక ఫోన్‌లలో ఏ ఫోన్ మోగుతున్నదీ తేలికగా గుర్తించవచ్చు.

---

"గర్వించి లాభం లేదు; నేటి నెమలి పింఛమే రేపు దుమ్ము దులిపే కట్ట!"

# మీకు తెలుసా?

టైపింగ్ స్పీడ్‌లో రికార్డు:

1946 లో జరిగిన టైపింగ్ స్పీడ్ టెస్ట్‌లో స్టెల్లా పజునాస్ నిముషానికి 216 మాటలు టైప్ చేసి, ప్రపంచ రికార్డు స్థాపించింది.

* * *

ప్రపంచంలో భాషలు:

ఇవాళ ప్రపంచం మొత్తం మీద వ్యవహారంలో ఉన్న భాషలు సుమారు 5,000!

* * *

అబ్రహాం లింకన్ పూర్వాశ్రమం:

అమెరికా అధ్యక్షులు కావడానికి ముందు పూర్వాశ్రమంలో అబ్రహాం లింకన్ సైన్యంలో ఒక సాధారణ సైనికుడుగా పని చేశాడు.

* * *

74 వర్ణాలు గల భాష:

అన్ని భాషలలోకీ మిక్కిలి పెద్ద వర్ణమాల గల భాష ఆగ్నేయాసియాలోని కంపూచియా (కంబోడియా) లో వ్యవహారంలో ఉన్న భాష. ఆ భాషలో వర్ణాలు 74.

* * *

'సివంగి'కి 'లియోపార్డ్' అనే పేరు ఎలా వచ్చింది?

ప్రాచీన కాలంలో సివంగి, సింహానికి (లయన్), చిరుతపులి (పాంథర్) కీ పుట్టి[ిన] జాతి జంతువు అనే నమ్మకం ఉండేది అందుకే అది 'లియోపార్డ్' అయింది.

* * *

వివిధ భాషలలో 'నియంత'లు :

హిట్లర్‌ని జర్మన్ భాషలో 'ఫ్యూరర్' అ[నే]వారు. ఇటాలియన్ భాషలో ముస్సోలినీ[ని] 'డ్యూస్' అనేవారు. స్పెయిన్ నియంత జన[]రల్ ఫ్రాంకోని 'కాడిల్లో' అనేవారు.

* * *

## లెడ్ పెన్సిల్ శక్తి



సగటున ఒక్కొక్క లెడ్ పెన్సిల్‌తో 3 మైళ్ళు పొడవు గల రేఖ గీయవచ్చును లేదా, దాదాపు 50,000 మాటలు వ్రా[య]వచ్చును.

"మూర్ఖుల వల్ల వివేకులకు లాభమే! మూర్ఖులు చేసే తప్పులు తాము చేయకుండా వారు జాగ్రత్తపడతారు!" —మార్కస్ కేటో

పైన్ ఆపిల్ (అనాస) ఆపిల్ కాదు:

అనాస పండు (పైన్ ఆపిల్) పైన్ చెట్టు మీదా కాయదు; అది ఆపిల్ జాతికి చెందిన పండూ కాదు.

* * *

అంతర్జాతీయ న్యాయస్థానం:

అంతర్జాతీయ న్యాయస్థానం నెదర్లాండ్స్ లోని 'హేగ్' పట్టణంలో ఉంది.

* * *

పాలపుంత' (galaxy) అంటే ఏమిటి?

అనేక కోట్ల నక్షత్రాల సముదాయం పాలపుంత'.

* * *

టీక్ పదం వ్యుత్పత్తి:

ఇవాళ ఇంగ్లీషులో వాడే 'టేక్' (teak) అనే మాట దక్షిణ భారత భాష అయిన మల యాళీ నుంచి ఇంగ్లీష్‌లోకి వెళ్ళింది.

* * *

లవంగాల పంట ఎక్కడ ఎక్కువ?

ఇండియాలోని దక్షిణాది రాష్ట్రం 'కేరళ' ప్రపంచంలో లవంగాలను ఎక్కువగా పండి స్తుంది.

* * *

వజ్రాల గనులు:

ఇండియాలో మధ్యప్రదేశ్ రాష్ట్రంలోని పన్నా'లో ఉన్న 'వజ్రాల గనులు' సుప్ర సిద్ధమైనవి.

కాంగ్రెస్ సంస్థను స్థాపించిం దెవరు?

భారత స్వాతంత్ర్య పోరాటానికి నాయ కత్వం వహించిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సంస్థను 1885లో స్థాపించిన వ్యక్తి ఏ.ఓ. హ్యూమ్ అనే ఆంగ్లేయుడు.

నార ఉత్పత్తి ఎక్కడ ఎక్కువ?

ప. బెంగాల్ రాష్ట్రం నారను ఎక్కువగా పండిస్తుంది.

## కేన్సర్‌ను నిరోధించడంలో మామిడి పండు పాత్ర



'కోలోన్' అనే పెద్ద ప్రేగు మొదటి భాగానికి కేన్సర్ వ్యాధి రాకుండా నిరోధించ డమే కాక, మామిడి పండులో ఉన్న పీచు వరిబీజం (hernia), అపెండిసైటిస్, కొరో నరీ గుండె జబ్బు, ఊబగా ఒళ్ళు రావడం లాంటి మరెన్నో అనారోగ్యాల నుంచి మనల్ని కాపాడగలదు. అమెరికా, యూరప్‌ల లోని ప్రజల ఆహారంలో పీచు లేకపోవడమే వారిలో 'కోలోన్' కేన్సర్ వ్యాధి ప్రబలంగా ఉండడానికి కారణం అని భావిస్తున్నారు.

"ప్రజలలో లోపించింది బలంకాదు; సంకల్పం!" —విక్టర్ హ్యూగో

(12 వ పేజీ తరువాయి)
సీతారామయ్య, ముట్నూరి కృష్ణారావు, కోపల్లె హనుమంతరావు వంటి ఆనాటి యువకులు జాతీయ విద్యా బోధనకు నడుం కట్టి, ఆ పట్టణంలో ఒక 'జాతీయ కళాశాల'ను స్థాపించారు. రూపాంతరం దాల్చినా, నేటికీ ఆ సంస్థ నిలిచి ఉంది.

మద్రాసులో మెరీనా బీచ్‌లో వేలాదిమంది వచ్చిన ఒక బ్రహ్మాండమైన బహిరంగ సభలో ఎలాంటి మైకుల అవసరం లేకుండా సుప్రసిద్ధ గ్రీక్ వక్త డెమాస్తనీస్‌ని గుర్తుకు తెస్తూ అనర్గళంగా పాల్ ఉపన్యసించారు. ఆయన ఉపన్యాసాల ప్రతిధ్వనులు బ్రిటన్ లాంటి సుదూర ప్రాంతాలలో కూడా విని పించాయి. లండన్‌లోని 'ది టైమ్స్' వంటి పత్రికలు కూడా వాటిని వ్యాఖ్యానించాయి. మద్రాసులో బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను అరెస్ట్ చేయాలని ఆలోచించారు, కాని ఆ నాటి అడ్వకేట్-జనరల్ సర్ వి. భాష్యం అయ్యంగార్ "అవి ప్రజలను రెచ్చగొట్టే మాట నిజమే అయినా, రాజద్రోహ పూరితాలు కావు" అని ఆయన ఉపన్యాసాల మీద తన అభిప్రాయం వెలిబుచ్చారట! అందుచేత ప్రభుత్వం కేవలం మద్రాసు ప్రెసిడెన్సీ నుంచి ఆయనను బహిష్కరించడంతో సంతృప్తి పడి ఊరుకోవలసి వచ్చింది.

1920 తరువాత కాంగ్రెస్‌కు మహాత్మా గాంధీ ఏకైక నాయకుడుగా రూపొందడంతో బిపిన్ చంద్ర పాల్ రాజకీయ రంగం నుంచి క్రమంగా నిష్క్రమించవలసి వచ్చింది. బోధించిన 'సముచిత సహకార (responsive co-operation) సిద్ధా తాన్నే అప్పటికీ సమర్థిస్తూ వచ్చిన పాల్ కొత్తగా గాంధీజీ ప్రతిపాదించిన 'సహకార నిరాకరణ' విధానాన్ని ఆమోదించ లేక పోయారు. అయినా నిర్భయంగా ఆయన తన అభిప్రాయం ప్రకటించారు. 1932 లో బిపిన్ చంద్ర పాల్ పరమపదించారు.

## అయిదోసారి టెన్నిస్‌లో ఛాంపియన్ అయిన మహిళ



జెకోస్లోవేకియాలో జన్మించిన అమెరిక మహిళ మార్టినా నవ్రటిలోవా ఇటీవ జూలై 7 న లండన్‌లో జరిగిన స్త్రీల వింబు డన్ పోటీలలో మరో అమెరికన్ క్రీడాకారి క్రిస్ ఎవర్ట్ లాయిడ్‌ని 7-6, 6-2 స్కో లతో ఓడించి 5 వ సారి ప్రపంచ ఛాంపియ షిప్ గెలుచుకుంది. ఇంతకు ముందు 197 1979, 1982, 1983 లలో ఆమె ఈ గౌర సాధించింది.

"దేవుడు నీముందే ఉన్నాడు - ఈ అన్ని ప్రాణుల రూపంలోనూ! వీటిని వదలి ఎక్కడో అన్వేషిస్తావెందుకు?" —వివేకానంద స్వామి

# స్వాతంత్ర్యము

## ఒక వరం ఒక సదవకాశం కూడా

పరదాస్య శృంఖలాలను త్రెంచుకొని, 37 సంవత్సరాల క్రితం, మనం స్వతంత్ర దేశాల కోవలోనికి చేరుకున్నాము. జీవితపు అనేక రంగాలలో, అప్పటినుంచీ, శీఘ్రంగా పురోగతిని సాధించాము.

దేశానికవసరమైనంతగా ఆహార ధాన్యాలను నేడు, మన రైతులు పండిస్తున్నారు.

పారిశ్రామికోత్పత్తిలో కూడా ప్రపంచ దేశాలలో మనమొక గౌరవనీయమైన స్థానాన్ని సంపాదించుకున్నాము.

ప్రతి ఒక్కరికీ ఆర్థిక-సామాజిక న్యాయాన్ని చేకూర్చేందుకు చేస్తున్న మన నిరంతర ప్రయత్నంలో, కొత్త 20-అంశాల కార్యక్రమం ఒక మహత్తర పాత్రను నిర్వహిస్తున్నది.

ఈ లక్ష్యసాధనకై కృషి చేయడం ద్వారానే, దేశంలోపల లేదా బయట నుండి వచ్చే ఎట్టి బెడదనైనా ఎదుర్కొని, మన స్వాతంత్ర్యాన్ని, ఐక్యతను పరిరక్షించుకోగలము. మనం ఎల్లప్పుడూ సంస్మరించుకునే ఈ లక్ష్య సాధనకు అత్యంతావశ్యకమైనట్టి సమైక్యతా కృషి, కఠిన పరిశ్రమలలో మగ్నమయ్యేందుకు, ఈ శివ స్వాతంత్ర్య దినోత్సవ శుభసమయాన దీక్ష పూనుదాము.



# నవ్వు

## సూర్య, చంద్రులలో ఎవరు గొప్ప?

'సూర్యుడు గొప్ప' అని ఒక రంటే, కాదు 'చంద్రుడే గొప్ప' అని మరొకరు అంటూ ఇద్దరు రైతులు తీవ్రంగా వాదించుకో సాగారు. వారి వాదం ఎటూ తెగక చివరికి గ్రామ పంచాయితీ పెద్ద దగ్గరికి వెళ్ళారు. ఆయన రెండు నిముషాలు ఆలోచించి ఇలా అన్నాడు: "చంద్రుడే గొప్ప! ఎందు కంటారా - రాత్రిపూట చంద్రుడు లేకపోతే వస్తువులు అసలే కనిపించవు గదా! వెలుతురు మనకు అవసరమే లేని పగటిపూట ప్రకాశించే సూర్యుడి దేం గొప్ప?"

* * *

## "నే ముందే చెప్పలేదూ?"

ఆర్థిక శాస్త్రవేత్త - సగం నీళ్ళు తీసేసిన స్విమ్మింగ్ పూల్ ఒడ్డున నుంచొని డైవింగ్ బోర్డ్ మీద నుంచి దూకుతున్న ఈతగాడికి విన పడీ వినపడకుండా "ముందు వెనుకలు చూసు కుని దూకడం మంచిది!" అని, తీరా అతనికి దెబ్బలు తగిలాక 'నే ముందే చెప్పలేదూ?' అనే మనిషిలాంటి వాడు!

## "కనిపించడం లేదు!"

ఓడ ప్రయాణికుడు: నేను ఎప్పుడు ఓడ ఎక్కినా ఏదో ఒకటి కనిపించకుండా పోతుంది."

స్టీవర్డ్: "ఈ సారి ఏం కనిపించడం లేదండీ?"

ప్రయాణికుడు: "ఇప్పటిదాకా కనిపిస్తూ వచ్చిన నేల కాస్తా ఇప్పుడు కనిపించ కుండా పోయింది!"

* * *

## 'నా వయస్సు!'

"నీ వయస్సెంత? ప్రమాణం చేశావు - కచ్చితంగా చెప్పు!" అని అడిగాడు జడ్జి

"2 ఏళ్ళమీద కొన్ని నెలలండి!" అంది ఆ అమ్మాయి.

"ఎన్ని నెలలు?"

"21 ఏళ్ళ మీద 104 నెల లండి!"

## ఇండియాలో ప్రచురించే ఇంగ్లీషు పుస్తకాలు

ఎక్కువ సంఖ్యలో ఇంగ్లీషు పుస్తకాలు ప్రచురించడంలో ఇండియా మూడో స్థానంలో ఉంది అమెరికా, బ్రిటన్‌ల తరువాత ఇండియా నుంచే ఇంగ్లీష్ పుస్తకాలు ఎక్కువ సంఖ్యలో వెలువడుతున్నాయి.

"'పలుకుబడి' అద్దం లాంటిది;
ఒకసారి పగిలితే అది మరి ఉపయోగించదు!" —స్కాట్

(16 వ పేజీ తరువాయి)
వచ్చింది. పరిశ్రమలలో పాశ్చాత్యుల సాంకేతిక విజ్ఞానంతో నడిపే భారీ పరిశ్రమ లెన్నో ఇండియాకు పూర్తిగా అనవసర మైనవి. పరిశ్రమలను మనం వికేంద్రీకరించాలి. వస్త్రాలు, నూనెలు, అగ్గి పెట్టెలు, టూత్ పేస్ట్లూ, సబ్బులూ, టూత్ బ్రష్లూ, ఫేస్ పౌడర్ వంటి శృంగార పోషక పదార్థాలూ చిన్న తరహా పరిశ్రమలుగానూ, వికేంద్రీకృత పరిశ్రమలుగానూ ఉత్పత్తి చేయవచ్చును. ఆ పని చేస్తే గ్రామీణ రంగంలో నిరుద్యోగ సమస్య పూర్తిగా పరిష్కారం అవుతుంది.

శాసన సభ్యుడుగా ఉన్న రోజులలో నేను నేర్చుకున్న ఒక ముఖ్య పాఠం చేనేత పరిశ్రమకు సంబంధించింది. వస్త్రపరిశ్రమలో వికేంద్రీకృతమైన చేతి మగ్గాలకే ప్రాధాన్యం ఇవ్వా లని గాంధీజీ ఎప్పుడూ చెప్పేవారు. చేతి మగ్గాలు అధిక సంఖ్యాకులకు జీవనోపాధి కల్పించగలవు. ఇండియాలో అవసర మయ్యే వస్త్రా లన్నీ చేతి మగ్గాలకూ, ఎగుమతి చేసే వస్త్రాలను మాత్రమే మిల్లులకూ కేటాయించా లని ఒకప్పుడు నేను సూచించాను.

నా రాజకీయ జీవితం నాకు నేర్పిన మరో పాఠం: ప్రజల తరపున పోరాడేటప్పుడు మనం ఎలాంటి సన్మానాలను గాని, సీనియారిటీని గాని ఆశించ కూడదు - అని. 1952లో నేను మొదటిసారి శాసన సభ్యుడుగా ఎన్నిక కాగానే మా తండ్రిగారిని సలహా అడిగాను. ఆయన ఇలా అన్నారు: "నీవు ఇప్పుడు ఒక ప్రజా ప్రతినిధివి. ధర్మాధర్మ నిర్ణయంలో నీ అంతరాత్మ ప్రబోధాలను తప్ప ఇతరుల సలహాలను అనుసరించకు!" ఆ నాడు మొదలు నా అంతరాత్మ ఆదేశాలనే పాటిస్తూ నిర్భయంగా నా అభిప్రాయాలను ప్రకటిస్తూ వచ్చాను. కాంగ్రెస్ వాదిగా నా పార్టీ పట్ల ఎప్పుడూ నేను విధేయత చూపేవాణ్ణి. ప్రతిపక్షాలతో ఎన్నడూ చేతులు కలుపలేదు.

1969 లో రాజకీయాలకు స్వస్తి చెప్పాను. ఇవాళ నేను స్వేచ్ఛాజీవిని. నా రాష్ట్రానికీ, నా దేశానికీ ఏది మంచి దని నమ్ముతున్నానో దానిని నేను ఆచరిస్తున్నాను. ●

## బొంబాయి, మద్రాసులలో జనాభా వత్తిడి



ప్రస్తుతం ప్రతి చ.కి.మీటర్ స్థలంలోనూ సింగపూర్, ప బెర్లిన్లలో 230 మంది మాత్రమే జీవిస్తూ ఉండగా, లండన్, హాంగ్ కాంగ్ నగరాలలో 4,600 మంది మాత్రమే జీవిస్తూ ఉండగా, మన బొంబాయి నగరంలో 45,000 మందీ, మద్రాసు పట్టణంలో 22,500 మందీ జీవిస్తున్నారు.

"దేని స్థానంలో అది ఉంటేనే ఉపయోగం!
ఉద్యాన వనంలో ఆవు ఉండడం వల్ల ఏం లాభం!"

# ఈస్ట్మన్ కనిపెట్టిన బాక్స్ కెమేరా

వేర్వేరు రకాల ఫొటో కెమేరాలనూ, ఫొటో నెగెటివ్‌లను డెవలప్ చెయ్యడంలో వాడే కెమికల్స్‌నూ భారీ ఎత్తున ఉత్పత్తిచేసే సుప్ర



సిద్ధమైన 'ఈస్ట్మన్ కోడక్' కంపెనీని స్థాపించిన మహనీయుడు జార్జ్ ఈస్ట్మన్ (1854-1932). అంతవరకూ అజ్ఞాతంగా న్యూయార్క్‌లోని రోచెస్టర్‌లో ఒక బ్యాంకు గుమాస్తాగా ఉండిన ఈస్ట్మన్ 1884 లో వాణిజ్యానికి ఉపయోగించే మొట్టమొదటి రోల్ ఫిల్మ్ తయారు చేశాడు. ఆ తరువాత 1888 లో ఆయన కనిపెట్టిన బాక్స్ కెమేరా సామాన్యమైన ఖర్చుతో ఎందరో ఫొటోగ్రఫీని ఒక హాబీగా అవలంబించడానికి దారి తీసింది.

ప్రపంచంలో ఏ ప్రాంతంలో అయినా, ఏ భాష మాట్లాడే వారైనా తేలికగా ఉచ్చరించడానికి వీలుగా 'కోడక్' అనే కల్పితమైన పేరును తన కెమేరాకు ఆయనే పెట్టాడు. ప్రపంచంలో మొట్టమొదటి సారిగా అమ్మకానికి పెట్టిన తన బాక్స్ కెమేరాకు ఆయన ఇచ్చిన అడ్వర్టైజ్‌మెంట్ నినాదం కూడా చాలా సరళమైంది: "మీట నొక్కడం వరకే మీవంతు; తక్కిన పని పూర్తిచేయడం మా వంతు."

1900 లో విశేష ప్రజాదరణ పొందిన 'కోడక్ బ్రౌనీ' కెమెరాను కేవలం ఒక్క డాలర్ వెలకే ఈస్ట్మన్ మార్కెట్‌లో ప్రవేశపెట్టాడు. తరువాతి కాలంలో కలర్ ఫొటోగ్రఫీని కూడా ఆయన కనిపెట్టాడు.

వేర్వేరు రకాల కోడక్ కెమేరాలూ, కెమికల్స్ మొదలైన సామగ్రిని ఉత్పత్తిచేసి ఈస్ట్మన్ బోలెడు డబ్బు గడించాడు. దానిలో వైద్య. సాంకేతిక సంస్థల స్థాపనకూ, ఇతర ప్రజోపయోగకరమైన కార్యాలకూ దాదాపు 10 కోట్ల డాలర్‌ల దాకా ఆయన ఖర్చు పెట్టాడు.

---

## ఈనాటి పాంట్‌ల తొలిరూపం

మొట్టమొదటి పాంట్ రెండు కాళ్ళకూ రెండు విడి తొడుగుల రూపంలో ఉండేది. మొలకు వేరే అంగవస్త్రం ధరించి దాని మీద ఆ తొడుగులు వేసుకునేవారు. క్రమంగా ఆ అంగవస్త్రం కూడా పాంట్‌లో భాగంగా అయింది. 'పాంట్‌కి' ఈ నాటి రూపం 1930 ప్రాంతంలోనే ఏర్పడింది.

---

"నేను ఏం చెయ్యాలి అనేదే నాకు ముఖ్యం:
ప్రజలు ఏమనుకుంటారో కాదు." —ఎమర్సన్

ఎందుకు ?

# ఇనుము ఎందుకు తుప్పు పడుతుంది?



అతి నిదానంగా వస్తువులను దగ్ధం జేసి వాటిలో అరుగుదలను కలిగించే కనపడని ఒక అగ్ని స్వతస్సిద్ధంగా ప్రకృతిలో ఉంది. కాలిపోయే స్వభావం గల వస్తువులను మామూలు అగ్ని ఆమ్లజనీకరిస్తుంది (oxidise). అంటే ఆ వస్తువులు 'ఆమ్లజని' (ప్రాణవాయువు) తో కలుస్తాయి లోహాలలో అరుగుదల హైడ్రాక్సైడ్ లవల్ల ఏర్పడుతుంది. అంటే అవి నీటితోనూ, ఆమ్లజనితోనూ కలుస్తాయి. అరుగుదలకు మూల కారణం విద్యుదీకరణమే అయినా ఒక లోహంలో మరో లోహంలో కంటె ఎక్కువ అరుగుదల కన్పించడానికి వేరే కారణాలు ఉంటాయి. కొన్ని లోహాలను పల్చని హైడ్రాక్సైడ్ పొర సంరక్షిస్తూ ఉంటుంది. ఇనుము మీది ఆ పొర పెచ్చులు పెచ్చులుగా ఊడి రాలిపోతూ, ఇనుము అరుగుదలకు కారణం అవుతుంది. 

---

## పాఠకుల అభిప్రాయాలు

(ఆగస్టు 1984)

★

"మాటల్లో మనది ప్రజాస్వామ్యం
చేతల్లో ప్రజలపైన స్వామ్యం
మాటకూ చేతకూ గల వైషమ్యం
తొలిగిపోయి పెరిగేనా సౌజన్యం?"

—శ్రీమతి టి. శమంతకమణి,
సిరికొండ (నిజామాబాద్ జిల్లా)

* * *

"తిరగనివ్వకు - 'కులం' గజ్జికుక్కను;
పెరగనివ్వకు - 'మతం' పిచ్చి మొక్కను."

—శ్రీమతి కె. సుధాదేవి,
ఇంకొల్లు (ప్రకాశం జిల్లా)

* * *

"స్వార్థమ్మును విడనాడు,
పరమాత్ముడె నీకు తోడు!"

—పి. అంజన్‌కుమార్, బీబీపేట
(నిజామాబాద్ జిల్లా)

"తీసిన కొద్దీ చెలమలో నీరు ఊరినట్టు
చదివిన కొద్దీ మనిషి 'వివేకం' పెరుగుతుంది." —తిరుక్కురళ్

# పోటీలు

అక్టోబరు 1984

'విస్‌డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును.

లు అందవలసిన ఆఖరు తేదీ: అక్టోబరు 20, 1984. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్‌డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004. —సంపాదకుడు.

## వ్యాసం

'ప్రజాస్వామ్యం అంటే?' అనే అంశం

## ప్రపంచంలో తొలి బస్సు



'ఆమ్ని బస్' (అందరికీ ఉపయోగించేది) అనే పేరుతో ప్రపంచంలో మొట్ట మొదటి బస్సును 1662 లో ఫ్రెంచ్ దార్శనికుడు పాస్కెల్ నడిపారు. అది గుర్రాలు లాగే బస్సు. కొద్ది సంవత్సరాలు పారిస్‌లో ఆ బస్ సర్వీసు నడిచింది గాని, అది అంతగా ప్రజాదరణ పొందలేదు. 1829 జూలైలో ఒక ఆంగ్ల 'కోచ్' నిర్మాత జార్జ్‌షిల్లీ బీర్ మూడు గుర్రాలు కట్టిన తన 'ఆమ్ని బస్‌ను' లండన్‌లోని 'పాడింగ్టన్ గ్రీన్'నుంచి 'బాంక్' దాకా 3 గంటల కొక ట్రిప్పు చొప్పున నడిపాడు. క్రమంగా 'ఆమ్ని బస్' అనే ఆ మాటే 'బస్' అయింది. ఇవాళ బస్ అంటే - యంత్రంతో నడిచే ఒక పెద్ద శకటం అని అర్థం.

---

"మనిషి సాధించే ఘన కార్యాల ప్రతిధ్వని 'కీర్తి'" —థామస్ ఫుల్లర్

5. అనిరుద్ధుడు: (ఏ) విరోధం లేని వాడు, (బి) ఉష భర్త, (సి) అర్జునుని కుమారుడు, (డి) మనస్సున కధి దేవత

6. అనంగుడు: (ఏ) నంగిగా మాట్లాడనివాడు, (బి) అంగం లేనివాడు, (సి) వినాయకుడు, (డి) మన్మథుడు.

7. అనీకిని: (ఏ) వెన్నెల, (బి) మెరుపు, (సి) సేన, (డి) అక్షౌహిణి.

8. అనుకంప: (ఏ) ఒక రకపు కంప, (బి) జాలి, (సి) అనురాగం, (డి) వాసన లేనిది.

విస్డమ్
పోటీల కూపను
అక్టోబరు 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 ల ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే....?

'దేవుడు కనిపిస్తే...?'' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ



8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

"పరులను జయించినవాడు విజేత,
తనను తాను జయించినవాడు మహా విజేత!" —లావో-త్సే

# పోటీలు (ఫలితాలు)

(అగస్టు 1984)

వ్యాసం: మొదటి బహుమతి: పి. రామ సుబ్బారావు, హైదరాబాద్; రెండవ బహుమతి: బత్తుల గోవిందరావు, మఠం సరియాపల్లి; మూడవ బహుమతి: కె బాలాజి, కమ్మవారి పాలెం (కృష్ణా జిల్లా)

క్విజ్ - జవాబులు: 1. లోక్‌సభ, 2. క్రికెట్ ఆటలో, 3. ఫ్రాంక్, 4. నెమలి, 5. లేదు, 6. లోకమాన్య, 7. దుబాసి, 8. వరుణుడు.

విజేతలు: మొదటి బహుమతి: కె. శ్రీలత, తెనాలి; రెండవ బహుమతి: కె. చంద్రశేఖర్, విశాఖపట్టణం; మూడవ బహుమతి: బి ఉమ, హైదరాబాద్.

పజిల్-జవాబులు-అడ్డం: 1. పాదుకా పట్టాభిషేకము, 5. దాయాదులతో, 8. తాపస, 9. కలము, 10. ధరలు, 11. హరువిల్లును, 13. గళిత, 15. నిశ్చల, 16. గణిక పస, 18. తిక్క రుక్మిణి.

నిలువు: 1. పారిజాతాపహ, 2. కాళిదాస కవి, 3. భిల్లుల. 4. ముసలము, 6. దుర్యోధనుని సతి, 7. తోకలు గలవారు, 12. రుక్మిణి, 14. తరవాణి, 16. గది, 17. శక్తి.

విజేతలు - మొదటి బహుమతి: మాస్టర్ I. కృష్ణమూర్తి కీసరగుట్ట, (రంగారెడ్డి జిల్లా); రెండవ బహుమతి: ఎస్. ఎల్. భవానీ శంకరశర్మ, జిల్లెళ్ళమూడి (గుంటూరు జిల్లా); మూడవ బహుమతి: పి. కె. గోపాల్, పెనుకొండ, (అనంతపురం జిల్లా).

తెలివికి పరీక్ష — జవాబులు: 1. పెరుగుట విరుగుట కొఱకే; 2. ఒక్కటీ ఉండదు, 3. బీర్, 4. పూర్ణం, 5. వానపాము, 6 విష్వక్సేనుడు, 7. (సి) సముద్రతీరాన, 8 వెలుపు (ఇది విశేష్యం, తక్కినవి విశేషణాలు)

విజేతలు: మొదటి బహుమతి: ఇటికేల వెంకటేశ్వర్లు, బి. కోడూరు (కర్నూలు జిల్లా): రెండవ బహుమతి: ఎస్. మధు

## పరమాణు విద్యుచ్ఛక్తి రియాక్టర్‌లు

'ది యునైటెడ్ నేషన్స్ ఇంటర్నేషనల్ ఆటమిక్ ఎనర్జీ ఏజన్సీ' వారి ప్రకటన ప్రకారం 1981 లో ప్రపంచంలో 23 దేశాలలో 1,50,000 మెగావాట్‌ల విద్యుచ్ఛక్తిని ఉత్పాదించే 271 రియాక్టర్‌లు మాత్రమే ఉండగా, 1982 లో 25 దేశాలలో 1,70,000 మెగావాట్‌ల శక్తిని ఉత్పాదించే 294 రియాక్టర్‌లు ఉన్నాయి.

"మన అవసరాలు ఎంత తగ్గితే దేవుడికి మనం అంత చేరువ అవుతాము!" - సోక్రటీస్

సూధనరావు. వసుంధర (శ్రీకాకుళం జిల్లా); మూడవ బహుమతి: ఎన్. వి. ఆర్. రమణ, హైద్రాబాద్.

మాటల మహిమ - జవాబులు: 1. ధర్మరాజు (పి), 2. జింక మొదలైనవాని చర్మము (బి), 3. బ్రహ్మ (బి), మన్మథుడు (పి). 4. రాజభవనం (పి), 5. బురద (పి), 6 బులాకీ (పి), 7. మన్మథుడు (బి). గొప్పవాడు (డి), 8. ఇంటికి వచ్చిన వ్యక్తి (పి).

విజేతలు - మొదటి బహుమతి: ఎమ్.డి. మసూద్ అలీ, జగత్యాల్ (కరీంనగర్ జిల్లా); రెండవ బహుమతి; ఇటికేల వెంకటేశ్వర్లు, బి. కోడూరు. (కర్నూలు జిల్లా); మూడవ బహుమతి: చిలుకూరి పూర్ణచంద్రరావు, పాల్వంచ (ఖమ్మం జిల్లా).

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: కె శరత్‌బాబు, నందిపేట్ (నిజామాబాద్ జిల్లా); రెండవ బహుమతి: సి. హెచ్. వి. ఆర్. ఆర్. బి. సురేఖావాణి గుంటూరు; మూడవ బహుమతి: గోపమ్ లక్ష్మీనారాయణ, కోరట్ల (కరీం నగర్ జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: శ్రీమతి టి. శమంతకమణి, పిరికొండ (నిజామాబాద్ జిల్లా); రెండవ బహుమతి: శ్రీమతి కె. సుధాదేవి, ఇంకొల్లు (ప్రకాశం జిల్లా); మూడవ బహుమతి: పి. అంజన్‌కుమార్, బీబి పేట, (నిజామాబాద్ జిల్లా).

మీరైతే? - మొదటి బహుమతి: ఎస్. వి. ప్రసాద్, పాల్వంచ; రెండవ బహుమతి: డి. సుబ్బన్న, హాలుకూరు (అనంతపురం జిల్లా), మూడవ బహుమతి: కె. రామాంజనేయులు, గుంటూరు.

భావ పరిచయ పోటీ - మొదటి బహుమతి: జి. నానారావు. అచ్చంపేట, (గుంటూరు జిల్లా); రెండవ బహుమతి: పి. పద్మారావు, మద్దూరు, (ప.గో. జిల్లా); మూడవ బహుమతి: బి. వి. ఆర్. భాస్కరరావు, కుంకల గుంట(గుంటూరు జిల్లా).

---

(4 వ పేజీ తరువాయి)

కాని, అవే మీకు అభ్యుదయానైనా కలిగించ గలవు. లేదా మీ పతనానికైనా దారి తీయగలవు - అని గుర్తుంచుకోండి: మీరు పని చేసే పరిసరాలలో ఏ చిన్న ప్రమాదం మీకు కనిపించినా వెంటనే దానిని మీ యజమానుల దృష్టికి తీసుకురండి. సకాలంలో కుట్టే ఒక్క కుట్టు ఆ తరువాత 9 కుట్లు కుట్టే అవసరాన్ని తొలగిస్తుంది.

ఈ క్రింది పద్యం భావం బాగా మననం చెయ్యండి:

"కొండ శిఖరాన 'పైన్'
చెట్టువి కాలేకపోతే ఏం:
కొండ లోయలో దిగువను
ఒక 'పొద'గానే ఉండు:
అయితే - అలాంటి పొదలకు
నీవు మేలు బంతివిగా ఉండు:
'చెట్టు'వి కాలేకపోతే ఫరవాలేదు -
'పొద'గానే ఉండు:

---

"ఎదురైన కష్టం ఎంత గొప్పదైతే
దాన్ని అధిగమించడం వల్ల వచ్చే ఘనత అంత ఎక్కువ!"